కీర్తి శేషులైన శ్రీ కందుల శ్రీమన్నారాయణగారిచే స్థాపింపఁబడియె.

సంపుటము. III || డిశెంబరు. 1913. || సంచిక. 8

# మానవసేవ.

నీతి మత సంఘ పరిశ్రమ భాషా విషయములఁ జర్చించు.

సచిత్ర మాసపత్రిక

రాజమహేంద్రవరము

---

పత్రికా సంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.

---

సత్యవోలు అప్పారావుచే

శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1913.

# విషయములు.

# ప్రార్థన

క. సాధుజనావనకలితము
పావనములు, పుణ్యాకల్పితామలపథసం
బోధనములు, మోక్షగమన
సాధనములు దేవదేవుసంప్రార్థనముల్. 302

ఆ. పరమపురుష! పరమపావన! పరమేశ!
భక్తవరద! భద్ర! భవవిదూర!
దురితహరణ! నిన్ను శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావ నయ్య మమ్ము. 303

క. ఆలింపుము విన్నప మిదె
వేలుపుగమిఱేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోనిచిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా! 304

క. సర్వము నీవ యయుండుదు
సర్వవిలోకనుఁడ వీవ సర్వాత్ముఁడవున్
సర్వాపరాధు నను నో
సర్వేశ! యనుగ్రహింపు సర్వాధారా! 305

క. నీమహిమ యెఱిఁగి పొగడఁగ
నే మెంతటివార? మఖిలనేతవు, త్రిజగ
త్క్షేమంకరుఁడవు, సుమతివి
తామసుల మగుమమ్ముఁ గావఁ దగుఁ బరమేశా! 306

మత్త. నిన్ను నీశ్వర! దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామలకీర్తిశోభిత! సర్వలోకశరణ్య! నే
నెన్నరానిమహాపరాధము లెన్నొ చేసితి నీయెడన్
నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ! 307

తే. దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు
వితతకరుణాసుధాతరంగితము లైన
నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ
జూచి సుఖులను జేయవే శుద్ధచరిత! 308

తే. అకట! దిక్కుల కెల్ల దిక్కైనమాకు
నొక్కదిక్కును లేదు కా లూద నైన
దిక్కు గా వయ్య దేవ! మాదిక్కుఁ జూచి
దిక్కు లే కున్నవారలదిక్కు నీవ. 309

క. నీపాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి జనుల కత్యుగ్రమహా
దీపితపాపజ్వాలనము
పైఁ బడ కుండెడివిధంబు భావింపఁ గదే! 310

ఆ. అంధకారవైరి యపరాద్రియవ్వల
జనిన నంధ మయినజగముభంగి
నీవు మానసముల నెగడక యుండిన
నంధతమసయుతుల మగుదు మీశ! 311

క. నీపాదకమలసేవయు,
నీపాదార్చకులతోడినెయ్యము, నితాం
తాపారభూతదయయును
దాపసమందార! నాకు దయసేయఁ గదే! 312

క. నాకున్ సఖ్యము పుణ్య
శ్లోకులతోఁ గాని తత్త్వశూన్యులు సంసా
రైకవిమోహులతోడం
గా కుండ నొనర్పు మయ్య కలుషవిదూరా! 313

శా. నీపద్యావళు లాలకించుచెవులున్, ని న్నాడువాక్యంబులున్
నీపేరం బని సేయుహస్తయుగముల్, నీమూర్తిపైఁ జూపులున్,
నీపాదంబులపొంత మ్రొక్కుశిరముల్, నీసేవపైఁ జిత్తముల్,
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నిర్వాణసంధాయకా! 314

శా. దేవా! నీచరణప్రసాదకణలబ్ధిం గాక లే కున్న నొం
దే వెంటం జను నీమహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీవారై చనువారిలో నొకఁడ నైనిన్ గొల్చుభాగ్యంబు నా
కీవే యెప్పటి కైన నన్నుఁ గరుణన్ వీక్షించి విశ్వేశ్వరా! 315

చ. అరయఁగ భక్తపాలనము లైనభవద్గుణజాల మాత్మ సం
స్మరణము సేయ, వాక్కు నిను సన్నుతి సేయ, శరీర మెల్లఁ గిం
కరపరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్పదఁ నంతె కాని నా
కరుదుగఁ జక్రవర్తిపద మైన నొసంగిన నొల్ల నీశ్వరా! 316

తే. భక్తజనసంతతానందభద్రకరము
ఘోరసంసారసాగరోత్తారణంబు
నవ్యయానందమోక్షదాయకము నైన
నీపదధ్యాన మాత్మలో నిలువ నీవె! 317

ఆ. భక్తకామదంబు, ముక్తిదాయక, మిలా
మండనంబు, దుఃఖమర్దనంబు,
భద్రకరము నైనభవదంఘ్రియుగము మా
మనములందు వరద! యునుపఁ గదవె! 318

తే. ఘోరసంసారసాగరోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగిహృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందునీచరణాంబుజాత
యుగళమును మామనంబులఁ దగుల నీవె! 319

ఆ. స్వప్రకాశ! సకలజగదంతరాత్మ వై
నట్టిదేవ! నీపదారవింద
యుగళి సానురాగయుక్త మై నామదిఁ
గలుగునట్లుగాఁగఁ దలఁపు మనఘ! 320

ఉ. వేదవధూశిరోమహితవీధులఁ జాల నలంకరించునీ
పాదసరోజయుగ్మము శుభస్థితి మాహృదయంబులందు ని
త్యోదితభక్తి మైఁ దగిలి యుండునుపాయ మెఱుంగఁ బల్కు వి
శ్వోదర! భక్తదుర్భవపయోనిధితారణ! సృష్టికారణా! 321

సీ. నీచరణంబులు నిఖిలలోకస్తుత్య! సనకాదిమునియోగసరణి నొప్పు;
నీపాదతలములు నిరవద్య! శ్రుతివధూసీమంతవీధులఁ జెన్ను మిగులు;
నీపదాబ్జంబులు తాపసమందార!భక్తులపాలిటిపట్టుఁగొమలు;
నీసుందరాంఘ్రులు నిత్యనికేతన! ముక్తికాంతామనోమోహనములు;
గీ. నీయడుగులపరాగంబు నిష్కళంక!
యఖిలజనములు శిరములయందుఁ దాల్తు;
రట్టిభవదీయదివ్యపాదారవింద
యుగళి మామకమనమునఁ దగుల నీవె!. 322

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రివియుఁ, దల్లుల కెల్లను దల్లి వీవు! మా
తండ్రివిఁ, దల్లివిం, బతివి, దైవమవున్, సఖివిం, గురుండవుం;
దండ్రులుఁ దల్లులున్ సుతుల ధన్యులఁ జేసిరె నీవిధంబునన్?
దండ్రి! నినున్ భజించెదము దాసుల మమ్ము ననుగ్రహింపవే! 323

ఉ. ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీఁకలు రానిపక్షులున్
దీకొని తల్లికిన్, మఱి విదేశగతుం డగుభర్త కార్తిమై
వ్యాకులచిత్తయైనజవరాలును దత్తఱమందుభంగి, నో
శ్రీకర! భక్తపాల! నినుఁ జేరఁగ నామది కోరెడుం గదే! 324

తరల. కడుపులోపల నున్నపాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో
నడువఁ బోలునె క్రాఁగి తల్లికి? నాద్య! సన్నము దొడ్డునై
యడఁగి కారణకార్యరూపము నైనయీసకలంబు నీ
కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్? 325

ఉ. నేరము లెన్న నెక్కడివి? నేము దలంచుతలంపులందులో
నేరుపు లున్నవే? సుతులనేరమిఁ దండ్రులు త్రోసిపుచ్చరే?
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?
నేరము గ్లుమమ్ము దయ నేఁ డిటుఁ గావఁ గదే కృపానిధీ! 326

చ. కడపటిసేఁత నైహికసుఖంబులఁ గోల్పడి రిత్తకోర్కెవెం
బడిఁ బడి యెండమావులను బాలిశులై సలిలాశ డాయుచుం
జెడుమనుజాల్ భవాబ్ధి దరిఁ జేరఁగ లేక వశింతు రట్టియా
యిడుమలఁ బొందఁ జాలము పరేశ్వర! లోకశరణ్య! కావుమీ! 327

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయాలతాబద్ధు లై
యిద మిత్థ మ్మన లేరు, తామసుల మై యేపారమాబోఁటిదు
ర్మదు లేరీతి నెఱుంగఁ జాలుదురు సమ్యగ్జ్ఞానధీయుక్తి? నీ
పదముల్ చేరెడిత్రోవఁ జూపి భవకూపంబుం దరింపింపవే! 328

మ. తమలోఁ బుట్టునవిద్య గప్పికొనఁడుం దన్మూలసంసారవి
భ్రము లై కోఁదలు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునం దేపరమేశుఁ గొల్చి ఘను లై కైవల్యసంప్రాప్తు లై
ప్రమదం బందుదు రట్టినీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా! 329

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు, మూఢునకు సన్మతి దా గురుఁ డౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండుపరేశ! మాకు ను
ద్యన్నయమూర్తి వై గురువ వై యలసద్గతిజాడఁ జూపవే! 330

చ. పరఁగుచు నున్నదుర్వ్యసనభాజన మై, ఘనదుఃఖమూల మై,
యరయఁగఁ బెక్కుతూంట్లు గల దై, క్రిమిసంభవ మైనయట్టిదు
స్తరబహుగర్భవాసములసంగతి మాన్పుటకై భజింతు నీ
శ్వర! భవదీయభూరిభవసాగరతారకపాదపద్మముల్. 331

మ. కలలం బోలెడిపుత్త్రమిత్త్రవనితాగారాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయుచందంబునన్
దలఁతున్ సత్యము లంచు మూఢుఁడ, వృథాతత్త్వజ్ఞుఁడన్; నన్ను నీ
విలసత్పాదయుగంబుఁ జేర్చి కరుణన్ వీక్షింపు విశ్వేశ్వరా! 332

ఉ. భూరిమదీయమోహతమముం బెడఁబాప సమర్థు లన్యు లె
వ్వారలు నీవ కాక? నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతాలవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! ధర్మవి
స్తారక! సర్వలోకశుభదాయక! నిత్యవిభూతినాయకా! 333

చ. హరిభజనీయమార్గనియతాత్మకు లై భవదీయమూర్తిపై
వఱలినభక్తియుక్తు లగువారలసంగతిఁ గల్గఁ జేయుస
త్పురుషనుసంగతిన్ వ్యసనదుస్తరసాగర మప్రియత్నతన్
సగసభవత్కృపామృతరసంబున మత్తుఁడ నై తరించెదన్. 334

చ. సమధికతేజ! దుఃఖలయసాధన మై తగుతాపకీనరూ
పము ననివార్యదుర్భరవిపద్దశ దుఃఖము నొందుమాకు నీ
సుమహితసత్కృపాగరిమఁ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొం డొకటి గల్గునె? భక్తఫలప్రదాయకా! 335

ఉ. నీవు చరాచరప్రచయనేతవు, ధాతవు, సర్వలోకపా
లావళిమౌళిభూషణుఁడ, వంచితమూర్తివి, దేవదేవ! దీ
నావన! నీ వెఱుంగని దజాండమునం దినుమంత యున్నదే?
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 336

చ. కర మనురక్తి షట్పదము గమ్రసుగంధమరందవాంఛచేఁ
దర మిడి శాతకంటకవృతస్ఫుటనవ్యతరప్రసూనముం
జరులను డాయుపోల్కిని, భృశం బగువిఘ్నములన్ జయించు నీ
చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితి మయ్య యీశ్వరా! 337

శా. రాఁడా? చూడ సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా? నాహృదయంబునందలివెతల్ లీలాగతిన్ ద్రోచి, నా
కీఁడా నేఁ డభయప్రదాన? మతఁ డూహింపన్ నతత్రాత దాఁ
గాఁడా? యొందఱుఁ గారుఁ? డీయెడల నన్ గావంగ రా కుండునే? 338

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక కలుగువాఁడు?
నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడినసాధుల కడ్డపడెడువాఁడు?
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు?
లీలతో నామొ ఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు?

తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యలరువాఁడు
భక్తజనముల దీనుఁ బాలివాఁడు
వినఁడె? చూడఁడె? తలఁపఁడె? వేగ రాఁడె? 339

శా. లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలం బయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్;
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపం దగున్ దీనునిన్;
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 340

ఉ. ఓకరుణాత్మ! యోవరద! యోప్రతిపక్షవిపక్షదూర! య
య్యోకవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగతాశ్రితా
శోకహ! యోమునీశ్వరమనోహర! యోవిమలప్రభావ! రా
వే! కరుణింపవే! దలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే! 341

సీ. ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు;
ఏనీశుభాకార మీక్షింపఁ గన్నుల నఖిలార్థలాభంబు గలుగు చుండు;
ఏనీచరణసేవ నేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబు బొందఁ గలుగు;
ఏనీలసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు;
తే. నట్టినీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది, నీయాన నాన లేదు;
కరుణఁ జూడుము సర్వేశ! పరమపురుష!
చిన్మయాకార! సన్మునిచిత్తచోర 342

సీ. నీపాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని కదలిపోవంగఁ బాదములు రావు;
నీకరాబ్జంబులు నెఱి నంటికొనఁ గాని తక్కినపనికి హస్తములు సారవు;
నీవాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలు సేరి వినవు;
నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు;
ఆ. నిన్న కాని పలుక నేరవు మా జిహ్వ। లొల్ల ననుచుఁ బలుక వొల్ల వీవు;
మామనంబు లెల్ల మరపించి దొంగిలి। తేమి చేయువార మింక వరద! 343

మ. జ్వరితార్తుం డగువాని కౌషధ మభీష్టం బైనచందంబునన్
ధరలో నాతపతప్తదేహి కతుశీతం బైనతోయంబునన్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహిదష్టుండ నై
పరఁగు న్నాకు భవద్వచోమృతము దప్పన్ మందు వే యున్నదే? 344

సీ. ఈపాపదావాగ్ని నేమిట నార్తుము నీమంజువాగ్వృష్టి నెగడ దేని?
ఈకల్మషాంబోధి నేత్రోవఁ గడతుము నీసేవ నావ యై నిలువ దేని?
ఈపాతకధ్వాంత మేజాడఁ జెఱుతుము నీహాసచంద్రిక నిగుడ దేని?
ఈకిల్బిషజ్వర మేభంగి నడఁతుము నీదయామృతమును నింప వేని?
ఆ. ఎట్లు నిర్వహింతు? మేలాగు మాలాగు?। కరుణ సేయ వేని, గదియ వేని,
ది క్కెవండు మాకు? దీనచింతామణి! । ఏమి సేయువార మింక నీశ! 345

సీ. దారుణమోహాంధకారపూరితుఁడను, హరివిస్మయస్మరణాగ్రహమతి నె?
పంచమహాతీవ్రపాతకోపేతుఁడ, హరివిస్మయస్మరణాగ్రహమతి నె?
కౌటిల్యకితవవికారపారీణుండ, హరివిస్మయస్మరణాగ్రహమతి నె?
యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ, హరివిస్మయస్మరణాగ్రహమతి నె?
తే. నిందలకు నెల్ల నెలవైననిర్గుణుండ, మందభాగ్యుండ, నే నేడ? మంగళకరు
దివ్యగుణనామకీర్తనతెఱఁగ దేడ? భూరిసుకృతంబు లే కెట్లు పొందఁ గలుగు? 346
సీ. కామహర్షాదిసంకలిత మై చిత్తంబు భవదీయచింతనపదవి సోరదు;
మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ నీవర్ణనమునకు నిగుడ నీదు;
సుందరీముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులుపడదు;
వివిధదుర్భాషల వినఁ గోరువీనులు వినవు యుష్మత్కథావిరచనములు;
తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ
దవులు గొలుపదు దేవ! సద్ధర్మములకు;
నడఁగి యుండవు కర్మేంద్రియములు, పురుషుఁ
గలఁచు, సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 347
సీ. విశ్వంబు నీవ యై, విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు, విశ్వమునకు
హేతువ వై పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధిచిత్త-
ముల కెల్ల నాత్మ వై, మొనసి గుణంబుల నావృత మగుచు, నిజాంశభూత
మగు నాత్మశయమున కనుభూతి సేయుచు, మూఁడహంకృతులచే మునుఁగుపడక,
తే. నెటి ననంతుఁడ వై, దర్శనీయరుచివి
గాక సూక్ష్ముఁడ వై, నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడ వన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెదఁ గావుము నిర్మలాత్మ! 348
సీ. పూర్ణుఁ డయ్యును మహాభూతపంచకయోగమున మేను లను పురముల సృజించి,
పురములలో నుండి పూర్ణభావంబున దీపించు నెప్పుడు ధీరవృత్తిఁ
బంచభూతములను బదునొకండింద్రియములఁ బ్రకాశింపించి భూరిమహిమ
షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వనిత్యవినోదంబు నెఱపుచుండు
తే. నట్టిభగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు! మానసోదితవాక్పుష్పమాలికలను
మంజునవరసమకరందమహిమ వుట్ట! శిష్టహృద్భావలీలలఁ జేయఁ గాత! 349

క. ఆపద సమస్తలోకులఁ। బ్రాపించుఁ దొలంగు నప్పుడు పదనము భంగిం
బైపడు నాపద సైచిన। భూపాలా! క్షణములోనఁ బొందు శుభంబుల్. 143

చ. ఉరుతరవిఘ్నము ల్దొడర కున్నతి నొందఁ దపంబు సేయఁడే?
గురువుల భక్తితోఁ గొలుతే? కోపము మోహము లేక యుందుదే?
యిరవుగ సంయమంబు విజితేంద్రియవృత్తియుఁ గల్గి సౌఖ్యముం
బొరయుదె? పుణ్యసంయములు పోఁడిగ నీకడ కేగుదెంతురే? 144

క. బుద్ధిం గార్యము దలఁపని। బుద్ధివిహీనులను భూతములె శాసించున్
సిద్ధింప దారయ నస। ద్బుద్ధులకును రాచకార్యభూతులు గలుగన్. 145

చ. ఉరుతరదుస్తరవ్యసన మొందినఁ బ్రాణభయంబుఁ బొందినన్
నురుచిరబుద్ధిసంయుతుఁడు శోకముఁ బొందఁడు; దుఃఖపుంజముల్
బెరసిన నజ్ఞుఁ డెంతయును భీతి మునుంగును శోకవారిధిన్
భర మధికంబుగాఁ గలుగు నావ పయోధి మునుంగు కైవడిన్. 146

క. శోకము సుఖముం జెఱుచును। శోకము తేజంబు నడఁచు శోకము బుద్ధిం
బోకార్చుఁ గానఁ దాలిమిఁ। గైకొని శోకంబు విడువఁగా వలయు నృపా. 147

క శమమును దానము ధర్మము। క్షమయును బటువిక్రమంబు సత్యంబును శీ
లము దుర్జనశిక్షయు భూ। రమణునకుం గలుగవలయు రాజితగుణముల్. 148

క. జనకుఁడు జ్యేష్ఠభ్రాతయు। ఘనవిద్యాప్రదుఁడు ధర్మకార్యములయెడన్
జనకసమానులు; తమ్ముఁడుఁ। దనయుఁడుఁ బ్రియశిష్యుఁడును సుతప్రతిమానుల్

క. శోకము సర్వార్థంబులఁ। బోకార్చును; శోక మాత్మఁ బొందక ముదముం
జేకొని కృతకృత్యుఁడ వయి। గైకొను తేజంబు జయముఁ గడుధర్మంబున్. 150

ఉ. పాపము సేయ నొండె, నతిబంధురధర్మము సేయ నొండె స
ల్లాపము లాడి సత్కృతి తలంపక బొంకెడువాఁడు, నర్థికిం
జేపడ నంచితోపకృతి చేసినవానికి వాంఛితంబు సం
క్షేపమనస్కుఁడై తనరఁ జేయనివాఁడును బూరుషాధముల్. 151

క. కులబలలలితుఁడు సూనృత। కలితుండు జితేంద్రియుండుఁ గరుణాన్వితుఁడున్
విలసితధర్ముఁడు నగురా। జిలలో నతిపూజ్యుఁ డగుచు సేపారు సిరిన్. 152

క. ఉపకారి యైనమిత్రుని । నపకృతి సేయం బ్రతిజ్ఞ నొనరించి మృషా
లపితుం డై యుండెడువా । కపటాత్ముం డధికహింసకతముం డరయన్. 153

క. మతిఁ దలఁప వచోభగ్నుఁ । ప్రతునకును సురాపునకు నిరంతరమును ని
ష్కృతి గలదు గాని తగ ని । ష్కృతి లేదు కృతఘ్నబుద్ధికిని విబుధోక్తిన్. 154

ఉ. శోకముఁ బొందునే ఘనుఁడు? శోకము కాలవిషంబు; శోక మ
స్తోకముఁ బొంద మానస మతివ్యథపాల్పడు; శోకమజ్ఞానిం
బైకొని చంపుఁ గ్రూరఫణి పాలునఁబోలెను; శోక మూర్మిలోఁ
జేకొనువానికిం బరఁగఁ జెల్లునె చేయ పరోపకారముల్?

తే. తొలుత మూడుపాయంబులు గొలుపకున్న । దుదిగదా క్రియోద్యోగమదియు రిపుడు
మత్తుఁడై యున్న శూరుచేత నొత్తఁబడిన । వీతబలుఁడైనఁ జనునందురు నీతివిదులు.

తే. నీతిపథమునఁ గార్యంబు నిశ్చయించి । తగవు దప్పక చేయునతండు మీఁద
నిడుమ పొందఁడు; ధర్మంబు విడిచి చొప్పు । దప్పి కావించునతఁడు సంతాపమొందు

క. మొదట విచారింపక చే । యుదు, రది తుది నొప్పకున్న నుక్కడఁగి ముదుం
గుదురు విను తులువ; లప్పను । లొదవక చెడు బూది నిడినహుతములకరణిన్. 158

ఆ. ఎఱుక లేక చపలుఁ డేవంకఁ దిరిగిన । నల్పమతులు వాని ననుసరింతు;
రొక్కఁ గొంగ పాఱ నున్నకొంగలు గూడ । నెగసి పాఱుచునికి తగవు గాదె. 159

క. మృగయుం డాఁకొని వచ్చినఁ । బగవాఁ డనుతలఁపు విడిచి పరహితబుద్ధిం
దగిలి కపోతం బచ్చెరు । వుగ నాహుతి యయ్యె మానవుం డేఁ దగఁడే. 160

క. దీనుఁ, గృతాంజలి నడిగెడు । వానిన్, మరణార్థిఁ జంప వలవదు శత్రుం
డైన ననుకణ్వవదనము । మానసమునఁ దలఁచు చుండ్రు మఱవక సుజనుల్. 161

ఆ. అభయదానమునకు నశ్వమేధాదులు । వేయు నీడు గావు, విశదకీర్తు
లఖిలదిశల నెసఁగ నార్తు రక్షించిన । నట్లు గాన సుజను లార్తు నిడరు. 162

క. క్షమయును బ్రియవాదిత్వము । శమమును నార్జవము దుర్విచారులు గదుఁ జా
లమిగా నూహింతురు లో । కము పెంచుట దెట్టిదంబు గలుగుటఁ జామ్మా. 163

క. దుష్టజననిగ్రహంబును । శిష్టపరిపాలనంబుఁ జేయుచు ధర్మా
విష్టుఁ డగు రాజు చెడఁడు; ని । కృష్టుం డగు రాజు జగత్కృతిఁ జెడిపోవున్. 164

క. ధర్మంబుచేతఁ బోలియు న। ధర్మము గృతయుగమునం, దధర్మమునం దా
ధర్మము దగుఁ ద్రేతఁ; యుగ। ధర్మ మెఱుఁగవలయు నీతితత్త్వజ్ఞులకున్. 165

చ. సమరమునందు శాత్రవులు చత్తురు రణం జన, దాత్మహానియున్
సమకొను గెల్పు సందియము; సన్నుతి కెక్కిన సామభేదదా
నము లవి యుండఁగా మొదల నాలవవెంట సమస్తబంధునా
శమునకు నోర్చి రాజు లిటు సాహసవృత్తిఁ దొడంగు టొప్పునే? 166

ఆ. మొదల సలయువిధము పిదపఁ గావించుట,। తుది నొనర్చుదానిఁ దొలుతఁ జేత
సంధివిగ్రహాదిసమయజ్ఞు లగునీతి। శాస్త్రవిదుల కదమసరణి గాదు. 167

క. ధనహీనుఁ డైనపురుషున। కనయముఁ జెడుఁ గార్యసిద్ధు లన్నియు గ్రీష్మం
బున సెలయేఱులక్రియ; బహు। ధనుఁ డైన నభీష్టసిద్ధి తథ్యము పొందున్. 168

తే. ఎంతయేనియుఁ దగబుద్ధిమంతుఁ డయ్యు। మెఱయ నయవిధిదప్పక మెలఁగిచేయు
నేర్పు గలఁడయ్యుఁ జెడు వేళ నిహతమతికి। దవిలిసద్బుద్ధు లెవ్వియుఁ దవులఁ జొరవు.

ఆ. పెక్కుమాట లేల? నిక్కంపు బగుపల్కు। వినుము భుజబలంబు వెలయుచుండఁ
బగఱ నోడుమ టొప్పుఁ; బంపశనంబున। విమలమయినయశము వెలయఁగలదె. 170

చ. అరయఁగ సర్వసిద్ధులకు హానికరంబులు, శిల్లభంగులన్
దురితపదైకమూలములు, దుష్టగరంబు, లధర్మమూలముల్,
సురతసుఖాభిలాషములు, సూరులు మెచ్చరు శాంతి వీడి దు
ర్భగతరభవ్యదుశ్చరితపాశల మాఱడిపుచ్చ రెన్నఁడున్. 171

క. నిరయమున కేడు తెరువులు,। సురలోకము తెరువు లేనిచొప్పులు, మహా
దురితంబుల పొలిమేరలు। పరికింపఁగ నింతు లెందుఁ బ్రియ్యక్తముగన్. 172

క. పరకాంతలు తల్లులుగా। నిరవారఁగఁ దలఁపకున్న నిహమును బరమున్
దొరఁకొనునె? మేలు గలుగునె? దొర యౌడే? పాని బుధులు దుష్టం డనరే?

క. వైరులఁ జాపుదు రొండెను। వైరులచేఁ జత్తు రొండె పరజన్యములన్
వీరులు; జయాపజయములు। నారయ సమవృత్తి నుండ వనిరి మహాత్ముల్. 174

క. పెంచక చేసినపాపము। మఱియొక్కఁడు పుచ్చుకొన సమర్థుఁ డగునె? కరి
మ్మఱిఁ దనక కుడువఁజాలయును। మఱలదు వెనువెంట వచ్చు మానుష నగునే? 175

క. సమయంబు రక్షణీయము। సమయము లంఘింపఁ గీడు సమకూరు నిలన్
సమయంబు దప్పి నడవరు। సమవృత్తిని సత్పురుషులు సన్నుతమతులై. 176

క. చీరలు గృహములుఁ దగుపాత్ర। కారములును దగిన తెఱలుఁ గాపులు మఱువే
నారీజనులకు సమ్యగు। దారం బగుచరిత మొకటి దప్పింపంగన్. 177

క. వ్యసనంబులఁ బరిణయముల। నసమము లగుసంగరముల యాగంబులఁ బ్రో
ల్లసదుత్సవముల మఱువుల। బిసరుహనయనలకు వలదు పృథులవిచారా. 178

క. మానం బరయఁగ బ్రాణస। మానము, మానంబు సఖుఁడు, మానమె ధనముల్;
మానము విడుచుటకంటెను। మానుగఁ బ్రాణములు విడువ మంచిది తలఁపన్. 179

క. పతి దైవము సతులకుఁ, దాఁ। బతియె పరాయణము, పతియె పరమహితుండుం;
బతిశుశ్రూషాపర యగు। సతివ సుమీ పరమపుణ్య యఖిలజగములన్. 180

## వాశిష్ఠరామాయణము.

క. అద్వైతతత్త్వమతుల జ। గద్విదితవిశాలయశుల గతకలుషుల రా
గద్వేషలోభరహితుల। విద్వత్సింహముల వేదవిదుల భజింతున్. 181

గీ. సారిదిఁ జింతాసమూహంబు చుట్టియున్న। ధనము దుఃఖంబె గాని సంతసము నీదు
సంపన్నూతకళత్రసంశ్రయగృహములు। దీను లగువారి కాపద దెచ్చునట్లు. 182

క. మదకారణంబు, లోభా। స్పద, మవివేకంబుతోడ్రిన, భయచింతలకున్
గుదు, రఘురాశి, మహోగ్రా। పదలకు నాశ్రయము ధనము పరమమునీంద్రా. 183

క. పరనింద పడనిధనికుఁడు। సారిదిం దను బొగడుకొననిశూరుఁడుఁ బ్రజలన్
సరిగాఁ జూచినప్రభువును। బురుషోత్తము లొందు దుర్లభులు తలపోయన్. 184

గీ. ఆయు వస్థిరంబు, నతి పేలవము, పల్లి। వాగ్రసలిలబిందువట్ల తలఁప,
నుండి యుండి దేహ మూరక పడఁ దోఁచి। వేదు రెత్తినట్లు విడిచిపోవు. 185

గీ. విను మహంకార మెందాఁక వృద్ధిఁబొందు। నకట యంతాక తృష్ణయు నతిశయిల్లు
మేఘబృందంబుపొందమైమింటఁదోఁచఁ।బొరివిజృంభించుకుటజమంజరియుఁబోలె

గీ. ఆయసాగ్నికంటె, నసిధారకంటెను,। బిడుగుకంటెఁ జాల బెడిద మగుచుఁ
దృష్ణ పెచ్చు మిగులఁ దీవ్రమై సతతంబు। హృదయముల దహించి యేర్చు నహహ. 187

గీ. ముదిమికాల మైన ముదిమియుఁ బొడసూపు। మరణకాల మైన మరణ మొదవు
పేదవాని కైన పృథివీపతికి నైన। సమము దేహములకు సహజ మిదియ. 188

గీ. యౌవనంబునందు నవికారి యై తన్నుఁ। బరులు మే లనంగ బ్రతికెనేని
యతఁడు పుణ్యపురుషుఁ డతఁ డుత్తమోత్తముఁ।డతఁడు వంద్యమానుఁ డఖిలమునకు

గీ. దోషములు దుష్క్రియాదులు దుస్సహంబు। లైనదుఃఖంబు లెల్లను నాత్మజ్ఞానంబ
శాంతి మది నూనుమాత్రన సమసిపోవు। నర్కుఁ డుదయింపఁ జీఁకటి యణఁగునట్లు.

క. వినునెడఁ గనుగొనునెడ మూ। ర్కొనునెడ ముట్టునెడఁ జవులు గొనునెడ మేల్గీ
డును వచ్చినపుడు మోదం। బును ఖేదము లేనియుత్తముఁడు శాంతుఁ డగున్. 191

గీ. పాలుమువేడుకఁ బెండ్లికిఁ బోవునపుడు। నుగ్రులై చంపఁ గొనిపోవు చున్నయెడల
చిత్త మెంతయుఁ జల్లనై శీతకరుని। చందమున నున్నయాతండు శాంతుఁ డండ్రు.

గీ. యుక్తియుక్త మైనసూక్తులు బాలుండు। చెప్పె నేని వినుము చిత్తగించి;
యన్య మైనవచన మది బ్రహ్మ చెప్పినఁ। దృణము పోలె విడువు ధీరహృదయ. 193

క. చిత్తంబ కర్త సృష్టికి,। చిత్తమ జీవుండు, గాక జీవుఁడు వేఱే?
చిత్తంబ చేయును గ్రియల్। చిత్తవ్యతిరిక్త మైనచేఁతలు గలవే? 194

క. సంకల్పమ సంసారము। సంకల్పమ చిత్తవికృతిజాలం బని ని
స్సంకల్పుఁడ వయి మానస। శంక లుడిగి దాని నణఁచి శాంతుఁడ వగుమీ. 195

గీ. ఆత్మతత్త్వం బనంతంబు నద్వయంబు। నిర్వికల్పంబు తాన యై నిండి యుండు
మూఢుఁడగుబద్ధుఁ డెవ్వఁడు ముక్తుఁ డెవ్వ।డన్నియును తన్మయత్వంబు లరసిచూడ.

గీ. శూన్య మగుట గాంచి శోకింప రెన్నఁడు। నమరవనఫలాదు లబ్బె నేనిఁ
జిత్తమునను వాంఛ సేయ రుత్తము లగు। వారు సూర్యునట్ల వసుమతీశ. 197

గీ. ఇతఁడు నాకు మిత్రుఁ, డితఁ డమిత్రుం డగు। నని తలంచువార లల్పమతులు;
తగ నుదారచిత్తు లగువారి కెంచున। వసుధయెల్ల బంధువర్గ మరయ. 198

క. ధీమంతు లైనవారలు। కామింపరు వీఁద దుఃఖకారణ మగు న
ట్లీమాయాసంపదలం। దేమిసుఖము గలదు మూర్ఖహృదయమ నీకున్? 199

క. శాంతరస మనురసాయన। సంతోషము దొఱఁగి విషయసక్తుఁ డగుట దా
సంతానవనము విడిచి దు। రంతపుమరుభూమి దిరుగ నరుగుట గాదే. 200

ఉ. అక్కట! కర్మదేవు లనఁ బట్టికలంపులఁ జిక్కి నిచ్చలుం
బొక్కెదు గాని శాంతరసమున్ వినఁగోరవుగా నొల్ల వెన్నఁడున్;
దక్కక యింద్రియాదులకు దాసుఁడ వై చెడిపోంగ నెందు నీ
కెక్కడి నేమి వచ్చె? నిటు లేటికి నేఁచెదు నన్ను జిత్తమా? 201

క. ఓలిని రసనాభోగపు। జాలిం బడి చవులఁ దగిలి చచ్చెదు సుమ్మీ
గాలం బెరవవి మింగిన। మీ లుసిగి యణంగినట్లు మిన్నక మనసా. 202

గీ. నేత్రవృత్తిఁ దగిలి నెలఁతలు మొద లైన। దృశ్యసుఖము మరగి తిరిగి తిరిగి
మంటలోన నుతికి మడిసిపోయినయట్టి। మిడుతవోలెఁ గాలి చెడకు మనస. 203

క. నాసావృత్తుల బడుమ దు। రాసం జనువనజకోటరములోపల నీ
వాసల నుడిండకుము క్రమ। లాసక్తిని జిక్కినట్టియళిగతి మనసా. 204

క. హరిణ కరి ఝష శలభ మధు।కరములు నొక్కొకటఁ గ్రాఁగెఁగదు నింద్రియముల్
పరువడి నన్నియు నిన్నుం।బోరి నడవఁగ నెట్లు సుఖముఁ బొందెదు మనసా. 20

గీ. నీవు చెప్పినట్లు నిత్యంబు సేయుచు। నేల చేల నైతి నివ్విధమున
దగువిచారవంతు లగుమహాత్ములరొండ। నీవు లేక యునికి నిజము మనస. 206

క. భూరి పరమాత్మతత్త్వము। కారణ మగు నీకు నందుఁ గలసితి వేనిన్
వారణకుక్షిగతం బగు। మారెడుబం డట్ల రూపుమాసెదు మనసా. 207

క. ఆపాదమస్తకం బై। చూపట్టినతనువునందు శోధింపఁగ నిం
దేపట్టున సేకాకిగ। నేపురుషుఁడు నిలుచు నిందు నే నని మనసా. 208

క. నిండినయింద్రియధనముల। భండారము నీవు వానిఁ బట్టి యుక్త వై
యుండి నిను నీవ తెలిసి య। ఖండామలబోధవీథిఁ గైకొను మనసా. 209

క. చిత్తము శీతల మగున। య్యుత్తమునకుఁ జల్ల నగుచు నుండు జగంబుల్
చిత్తము శీతత నందని। యత్తబిపికి నైన నసల మగు జగ మెల్లన్. 210

గీ. ఒనర సందేహరహితుఁ డై యుండి చిత్స్రు।బుద్ధమానసుఁ డై యున్న పుణ్యపురుష
దశవి నుండిన సంసారి యైన నేమి?। రెండుగతులును సములై యుండు నవఘ

గీ. అల్పవాసన గలచిత్తమలిని రొద్ది। చేసినను జేయకున్నట్లు చెంద దందుఁ
గట్టిగ నిలలోన నూతిలోఁ బడినవాని। యంగముల కింక తెనివము హాని యగునె?

క. మనమున నొద్దిరయుఁ జేయక। యునికి సమాధాన మనియు నుత్తమమును సా
వనమును శుభమును గేవల। మును బరము నివృత్తి యనఁగ బొల్చును వత్సా. 213

క. విను మంతర్ముఖుఁ డై జగ। మను తృణముఁ జిదగ్నియందు నాహుతి గాఁ దా
నొనరించినమునివరునకు। మొనయదు విభ్రాంతి చిత్తమున నెన్నఁటికిన్. 214

గీ. లేని వియ్యును గలయట్లు గానిపించు। జగము లాభాసమాత్రమ యగు మునీంద్ర!
యొండమావులు నీళ్లని యుటెఁగినట్లు। మూఢుఁ డేని సత్యమెఱుఁగక మునుఁగునందు

మ. సకలంబుం బెడబాసి శాంతత విశేషంబుల్ విసర్జించి పా
యక నిర్భీకత యీషణత్రియమనోహంకారశత్రుంఁడ వై
యకలంకాత్ముఁడ వై యకించనత భిక్షాహారి వై యుండుఁ జే
రక వర్తించిన నున్నతోన్నతపదప్రాప్తుండ వౌ దల్లెడన్. 216

గీ. శాస్త్రచింతల సజ్జనసంగములఁ। జల్లనగుఁ జిత్త మల్లనఁ జంద్రుభంగిఁ
గేవలాభాస మది స్వానుభావమహిమ। దోఁచు నుల్లంబులో మహాత్ములకుఁ దాన

క. ఫల విఫల రాగ రోషా। ద్యల ధర్మాధర్మదుఃఖసౌఖ్యము లెందుం
దలఁపక చరించు నెవ్వం। డలఘుమతీ! యతఁడె పో మహాకర్త ధరన్. 218

క. సమభావన నెందు విరో। ధము వడయక కోర్కు లెల్లఁ దావీడ్కొని పా
త్రమ యనుభవించు నెవ్వం। డమలమతీ! యతఁడె పో మహాభోక్త ధరన్. 219

క. జనియును మృతియును ధర్మం। బు వధర్మము సుఖము దుఃఖమును లే దని నె
మ్మనమున బోవిడు నెవ్వం। డనఘా! మఱి యతఁడె పో మహాత్యాగి ధరన్. 220

క. మేరుసమానుని నైనను। శూరోత్తము నైనఁ దృష్ణ సోఁకినయేనిన్
జీరికిఁ గైకొన రన్యులు। వారయ నది దొలఁగినతఁడె యధికుం డెందున్. 221

క. గురువాక్యము శాస్త్రార్థముఁ। బొరిపొరిఁ జిత్తానుభవముఁ బొందించి నిరం
తరమును నైక్యాలోకన। పరుఁ డగువభ్యాసి పొందుఁ బరతత్త్వంబున్. 222

క. విను మోక్షద్వారపదం। బునకు శమంబును విచారమును సంతోషం
బును సాధుసంగమంబును। ననునాలుగు ద్వారపాలకాభిదము లగున్. 223

గీ. సర్వమానవులకు సంసారతారణ। కారణంబు పుణ్యాకారణంబు
నై వెలుంగుచుండు నఖిలసంస్తుత్య మై। సాధుసంగమంబు జనవరేణ్య. 224

గీ. విమలమతులు సములు వీతగర్వాగ్రహు। లాత్మవిదులు సాధు లైనజనులు
సేవ్యు లెందు; వారి సేవించుటయె భవ। జలధి యుత్తరింపఁ గలుగువెరవు. 225

క. ఎవ్వరు సత్త్వగుణంబున। నివ్వటిలుదు రట్టియోగనిత్యులు సుఖు లై
యెవ్వేళ నైన వాడరు। మవ్వం బగుకనకమయకమలముం బోలెన్. 226

గీ. కోరవలసినవస్తువు కోరికొనరు। కడు రమింతురు సిద్ధమార్గములయందుఁ
జంద్రబింబంబులోపలి శైత్య మట్లు। గుణము లెడఁబాయ రాపదగూడినపుడు. 227

గీ. కణఁగి యెల్లచోటఁ గలది చిద్రూపంబు। అదియ నీవు నేను నఖిలములును
ఇదియ నిశ్చితార్థ మిది తప్ప మఱి లేదు। సర్వశాస్త్రసారసంగ్రహంబు. 228

గీ. మాడఁ బడుచున్నవస్తువుఁ జూచి దాని। యోగమున నాత్మతత్త్వసముత్థ మైన
జ్ఞాననిశ్చయనిశ్చలానంద మెద్ది। యది యుపాసింతు మనమున ననుదినంబు. 229

క. పూని యభీష్టపదార్థము। గానంబడునపుడు చిత్తకలితం బగున
య్యానంద మెద్ది యది బ్ర। హ్మానందం బని భజింతు ననవరతంబున్. 230

గీ. ద్రష్టృ దర్శన దృశ్య సంతతిఁ దదీయ। వాసనాయుక్తముగ నెడఁబాసి ప్రథమ
దర్శనాభాస మైనయాత్మస్వరూప। మెల్లకాలంబు నే భజియింతుఁ దగిలి. 231

క. ఏవెలుఁగు తాన వెలుఁగఁగ। నావెలుఁగునఁ గానిపించు నఖిలము వెలుఁ గై
తా వెలసి మొదల వెలిఁగెడు। నావెలుఁ గగునాత్మ నే నుపాసింతుఁ దగన్ 232

గీ. కలదు లే దనురెండుపక్షములనడుమఁ। జెంది సర్వంబుఁ బొడగానఁ జేయుచున్న
యట్టి నిత్యస్వరూపంబు నాత్మయందు। నిలిపి సద్భక్తి సతతంబు దలఁతు నేను. 233

క. ఆకారము గల దనియు ని। రాకారం బనియు శూన్య మనుజనమతముల్
సోఁకక సంవిద్రూపు ని। రాకారము నైనయాత్మ ననుసంధింతున్. 234

గీ. వివిధభావాంతరస్థుఁ డై విగతచైత్య। చిన్మయుండును పరిపూర్ణచేతనుండు
నవ్యయాచ్ఛిన్నుఁ డగుచున్న యట్టియాత్మ। నేన యగు నాకు మ్రొక్కెద మానసమున.

గీ. నిఖిలలోకప్రకాశమాణిక్య మైన। దేవ! చిరకాలమునకు సిద్ధించి యుదితుఁ
డై వెలింగెదు నిత్య! యనంత! నీవ। యేన యగునాకు మ్రొక్కెద మానసమున. 236

గీ. తప్పుమార్గములను బన్ని తగవులాడి
పాపములఁ గప్పిపుచ్చెడుపామరుండు
విమలవిజ్ఞానవేత్త నా వెలయఁ గలఁడె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 96

గీ. పండితుం డైనమాత్రాన పట్టువడదు
దానములఁ జేసినంతన తగులుకొనదు
నిర్మలజ్ఞానసంపత్తి నీచమతికి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 97

గీ. పరులు దూషించినంతన భ్రష్టుఁ డగునె
ధర్మసత్యశౌచంబులఁ దాల్చునతఁడు?
పరుల వంచించి నడచిన పరువు గలదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 98

గీ. దేహమును చంచలం బని తెలిసి సతము
జీవమును నమ్మి వర్తించి చెడరు ఋషులు
పౌరుషంబునఁ గీర్తిని బడయఁ గోరె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 99

గీ. ధర్మసత్యశౌచంబులు తనరుపాంటె
నిర్మలజ్ఞానసంపత్తి నెగడుపాంటె
సత్యమో లప్పురా విది సంతరించె;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 100

# శారికాగీతము.

---

శారికాంగన కాసారతీరమందుఁ
జేరి జలకేళి సవరించి చెలులఁ గూడి
మందమారుత మందందు మసలు చుండ,
విరులక్రొత్తావిబుగబుగల్ విస్తరిల్లఁ,
బంషుటాకులరాగంబు పరిఢవిల్ల,
ద్విజతతులశ్రావ్యనాదముల్ విందు సేయ,
కుటజములనీడ పుష్పాళ్లు కుప్పతిల్ల,
చలువపందిళ్ల నొప్పుమంజరులతోడ,
విరియఁ బూచిన సంపఁగెవిరులతోడ,
రమ్యతర మైనశుకవిహారములతోడ,
శ్రుతుల కింపైనపరపుష్టరుతులతోడ,
వన్నె మీరినయుద్యానవనముఁ జేరి
మాధవిని గూడి శోభాయమాన మగుచు
పల్లవిత మైనసహకారిపజ్జ జేరి
పాట పాడెనువేళ నుపాంగమట్లు
బంభరంబులనాదముల్ పటవణింప
మెడలు సారించి శ్రుతులతో మేళవించి
కొంత యొయ్యారమ్మును జాలువింతనడలు,
నడకలకు వన్నె వెట్టెనునాట్యములును,
నాట్యమున కింపు రవణించువట్టిపలుకు
నెచ్చెలులతోడఁ బల్కునాసచ్చరిత్రి
సరసముగఁ బాడుచుండ వసంతమందు
శారికాగీతములు విన శ్రావ్య మగుట
నెల్లవారలు చెవియొగ్గు టేమివింత?

# సృష్టిస్త్రీల పరిణామము.

గీతమాలిక.



ప్రకృతి యంత నేమొ మేమును ♦ బలుక లేము;
పటముపై దాని మేనును ♦ వ్రాయ లేము.
ధరణిపరమాణువులు, సము ♦ ద్రంపుజలము
బిందువులు, తారకలు లెక్కఁ ♦ బెట్టవచ్చు;
సూర్యచంద్రాగ్నిలోకముల్ ♦ చూడవచ్చు;
వచ్చునన్నియు వినరింప ♦ వచ్చుఁ గాని,
ప్రకృతికలనంబు వివరింప ♦ వశము లేదు;
లే దనుచు నూరకుండఁగా ♦ లేము కాని
యెటుల నీచూట్కి ద్రిప్పిన, ♦ నేది గనిన,
నేది గాంక్షింపుచున్నను, ♦ నేది వినిన
ప్రకృతి గాక మఱేదియుఁ ♦ బడయ లేవు;
సొగసు గాక మఱేదియుఁ ♦ జూడ లేవు;
కాంతి గాక మఱేదియుఁ ♦ గాంచ లేవు.
మానసాక్షులు నలుదెసల్ ♦ మలపినపుడు,
భావ మాకాశమునకంటెఁ ♦ బైకిఁ బోవ
నిచ్చినప్పుడు, మా కతి ♦ స్వచ్ఛమైన
ప్రకృతియే చూడవచ్చె. ♦ మాప్రకృతి కెల్ల

కాణ వెలుఁగొందువెన్నెల ♦ రాత్రులందు,
తతమనోహరశాద్వల ♦ తలమునందు,
హారిణకుణకముల్ చెరలాట ♦ లాడునపుడు,
నేమనోజ్ఞవిలాసంబు ♦ లెనయఁ గలవో
యందులోపల ప్రకృతినే ♦ యరయఁగలవు.
అభ్రశకలంబు లిరువాగు ♦ లైనయపుడు,
మింటితెర లల్లనల్లన ♦ మెలఁగునపుడు,
అస్తమితసూర్యబింబ మా ♦ యపరవార్ధి
కభిముఖం బయి పోయి మే ♦ ఘాంచలముల
స్వర్ణవర్ణంబులను దిద్ది ♦ వరలునపుడు,
సాంధ్యరాగంబు పర్వత ♦ సానువులను
జారుసెలయేళ్ళ నెక్కునై ♦ చన్నయపుడు,
గాంతి మోదంబుతోడ నై ♦ క్యంబు నొందు;
నందులోపల ప్రకృతినే యరయగలవు.
ప్రకృతితేజంబు మే మిరు ♦ వాగులందుఁ
జూచుచున్నాము; మొదటిది ♦ సుదతిమోము;
సుదతి సామాన్య గాదు మా ♦ చూట్కి కిలను;
దాని బెడఁగునఁ బురుషుని ♦ మానసంబు
సలిలప్రతిబింబసూర్యమం ♦ డలముభాతి
సంతతచలాచలీకృత ♦ నంత మగుచు,
వింతమార్పులఁ జెందుచు ♦ నంతకంత
కతిశయించుట రెండవ ♦ దది తలంప.
మోహ మనునది యెంతటి ♦ ముద్దుపలుకో?
మోహదేవత యెంతనై ♦ పుణ్యవతియో?

మోహమున లోక మంతయు ♦ మునిఁగిపోయె.
యువతి రత్నాలపేరుకై ♦ యొదవె నొక్కొ?
తండులంబుల కాశించి ♦ తారె నొక్కొ?
రంగుచీరలకొఱకు జీ ♦ రాజె నొక్కొ?
భర్తృహృదయంబుఁ బట్టి సం ♦ భ్రమముతోడ
ఘల్లుఘల్లున నందెల ♦ కలరవంబు
మ్రోయఁ జేయుచు తిరుగున ♦ మోహనాంగి
మానసమునందు మోహబం ♦ ధంబు గలదొ?
ఆశయే యున్నదో యది ♦ యనుగ రాదు.
కాని సతి యామె యని చెప్పఁ ♦ గలము మేము.
ఊడిగంబులు సేయఁగా ♦ నుంచినారొ?
తెచ్చినధనంబు దాచఁగాఁ ♦ దెచ్చినారొ?
బాహ్యకామేచ్ఛలను దీర్పఁ ♦ బడసినారొ?
కాయలను గాయుసాలవృ ♦ క్షంబులీల,
నింట సంతతసంతాన ♦ మీనుకొఱకు
నిలువఁబెట్టినపురుషుని ♦ నెమ్మనమునఁ
బ్రేమ యున్నదొ? లేక ప ♦ విత్రమైన
కులసతీగౌరవమె యందుఁ ♦ గలదొ యేమొ?
యెవరు చెప్పఁగ నేర్తు రా ♦ ప్రవిమలంపు
మైత్రి యొక్కొక్కచోట వి ♦ చిత్రలీలఁ
గంటి మావధూవరులకేరి ♦ గంటిచూపు
లరిదు మోహానురాగరా ♦ గాచ్ఛవెక్కి
విభుని నొకలేమ దాచెను ♦ వీక్షణముల;
నొకతె సంగోరుచీరచే ♦ నొడలు గప్పె;

నొకతె యశనాంబువులు మాని ♦ యోలలాడె;
నొకతె జీర్ణాంబరంబుల ♦ నొప్పియుండె;
నొకతె యశుచివసనంబు ♦ లోలిఁ గోర
వారితలఁపున నేప్రేమ ♦ వార్ధి గలదొ?
వారిసర్వావయవము లే ♦ పాశమందుఁ
గట్టఁబడి దుర్నిరీక్ష్యమై ♦ గ్రాలునవియొ?
యదియె మోహనమంత్రమ ♦ ధ్యాత్మికంబు.
గానలోలుఁడు కృష్ణుండు ♦ గానలోన
చారుయమునానదీపరి ♦ సరమునందు
వేణునాదంబు పూరించి ♦ విశ్రుతవిమల
గీతికల నింప వల్లవీ ♦ కీరవాణు
లాలమందలతోఁ గూడి ♦ యాలకించి
మోహమున మున్గి; రపుడు మ ♦ నోహరత్వ
మేమి తట్టెనో? వారి కం ♦ దేమిశక్తి
వెలువడెనో? మేము చెప్పఁగా ♦ వెఱచుచుంటి;
మది కలుషితము గాఁజాల, ♦ దది నిజంబు;
దైవమునకును దద్భక్త ♦ తతుల కున్న
యభినవానూనరాగమం ♦ చంద్రు బుధులు.
దానిలో నేమియర్థంబు ♦ దాఁగినదియొ
చెప్పఁగా లేము మా కది ♦ చేతఁగాదు;
మాకలము వ్రాయ దం దున్న ♦ మర్మ మేమొ
యెఱిఁగియుండిన నేమని ♦ యెదరొ యేమొ?
కవి యెఱుంగనియర్థంబు ♦ కల మ దెట్లు
తెలుపు నని మీరు లోలోనఁ దలఁపఁగలరు?

జడమునకు జ్ఞానమే ♦ సహజం బటన్న
నిజమె యది కాని వాసనా ♦ న్వితముచేత
సాహసించుచు నున్నది ♦ సహజబుద్ధి.
మురళియును మాకలంబును ♦ మున్నొకప్డు
కానలో కట్టి లగుట శ్రీ ♦ కాంతుఁ డచట
పాడి మొల్లను జిగురింపఁ ♦ బరపి యుంట
నమ్మహావాసనకులకి ♦ మాగతంబు
వచ్చి యావేశమునఁ జెప్ప ♦ వచ్చుచుండుఁ
గాని సమయంబు గా దని ♦ కదపలేదు.
ఆచరిత్రంబు, లాకాల, ♦ మావిలాస,
మావినోదపుచర్య నీ ♦ యక్షువులకుఁ
గట్టినట్టుల రూపింప ♦ గడఁగినపుడు
నెవని స్మరియింతువో, నీవ ♦ యెవనిమూర్తి
లీలఁ బరికింతువో చెప్పఁ ♦ జాలదేని,
నీకు నాలుక గలదేని, ♦ నీకలంబు
వ్రాయఁగలదేని, ప్రజలహృ ♦ త్ఫలకమందు,
నింపు మది చాల ప్రకృతి వ ♦ ర్ణించునట్లు
నంతసింతుము నీవచ ♦ శ్శక్తి కేము.
కాని తేలిపోఁగూఁడ దెం ♦ దేని నీవు.
నీవు గలతావు మాకును ♦ నెఱుఁగ నయ్యె.
అమలప్రత్యూషసమయశ్రీ ♦ తానిలంబు
లురలు తటినీతటత్పరి ♦ సరమునందు
పులినసీమలఁ గూర్చుండి ♦ విలసదభ్ర
గోళమందున దృక్కులు ♦ గొలిపినావు;

చాతకము ఱెక్క లల్లార్చి ◆ చాలసేపు
వినువకుండఁగ నెగురుచు ◆ మసకలోన
కరిగి తిరిగి క్రిందకు వచ్చు ◆ నట్లు చూచి
నీమనంబును దానితో ◆ నెనపినావు.
అపుడు నీసతి నీదృష్టి ◆ యందు మెలఁగె;
నాఁమె యెన్మిదిపదివేల ◆ యతివలట్లు
దోఁచెఁ గాఁబోలు; వారి దో ◆ బూచులాడి
యాడి సంతోషమునఁ దేలి ◆ యాడినావు.
ఇదియె పరమార్థ మని నిశ్చ ◆ యించినావు.

# ఇరువదియొకటవ ప్రకరణము.

——(:)——

ఒకనాడు సుమారు జామున్నగ ప్రొద్దెక్కినపైని, తంబుర చేతఁ బూని, గూడ కట్టు కట్టుకొని, నొసటఁ దిరుమణి శ్రీచూర్ణంబులు దిద్ది, కంఠమునఁ దులసిపూసలు మాలికలుగ ధరించి, చంక జోలె వేలాడ, నొక దాసరయ్య పెరుమాళ్లను భజించుచు నక్షయపాత్రికై యమునానది దాటి, మధ్యహిందూస్థానమునకుఁ బయనమై పోవుచుండెను. అతఁడట్లు యమునానదిం గడచి యొక మైలుదూర మరుగునప్పు డచ్చట ముగ్గురు తురకలు త్రోవలో నిలుచఁబడి యుండిరి. వారిలో నొకఁడు యజమానుఁడు. తక్కిన యిద్దరు సేవకులు. వా రాయుధపాణులై యుండుటఁ జూచి, దాసరి త్రాసముఁ జెంది బాటకుఁ బ్రక్కఁ బడిపోవఁ జూచెను. అతఁ డట్లు యత్నించుట తురకల కనుమానము గల్గి వెంటనే వెంబడించి వానిని బట్టుకొని, జోలెలో నున్న సేరున్నరబియ్యము వెలుపరించి చూడ నందులో నొకయుత్తరము గనఁబడినది. సేవకు లాయుత్తరమును సంగ్రహించి యజమానున కిచ్చి, యా దాసరివాని తంబుర లాగికొని చెంత నున్న యొక ఱాయిపైఁ బగులఁగొట్టిరి. యజమానుఁ డా దాసరిని గొన్ని ప్రశ్న లడుగ, నాతఁడు జవాబు చెప్పనందున వానిని బడఁద్రోసి గూడకట్టూడఁదీయ యత్నింప, స్త్రీని నవమానపఱచుట న్యాయము గాదని దాసరి ప్రార్థించెను. అంత నాతురకశ్రేష్ఠుఁ డాశఁ జెంది యామెను యమునానదీపులినతలంబులకుఁ దీసికొనిపోయి కొంతవడి నామెతో సుఖించెను. అనంతర మాతురక లామెను దమతో బలవంతముగ నీడ్చుకొనిపోయిరి.

# ఇఱువదిరెండవ ప్రకరణము.



అజాఫ్‌ఖానుఁడు దుల్పట్‌షాపైఁ గసి దీర్చుకొన సమయమునకై వేచియుండు నంత, నబ్దుల్‌ఖానుఁ డొకహిందూసేవకుని నిర్బంధించి తనప్రభుపునెదుటఁ బెట్టి “ప్రభూ! యీసేవకుఁడు ఘుర్‌మండలమునుండి కనోజునకుఁ బోవుచుండఁ బట్టుకొని నిర్బంధించి తెచ్చితిమి. వీనియొద్ద నిదిగో యీయుత్తరము దొఱకెను. దీనిఁ జిత్తగింపు” డని చేతి కిచ్చెను. అయ్యది జనార్దనసింగునకు దుల్పట్‌షా, తనస్థితిగతు లెఱింగించుచుఁ దనసహాయార్థము వెంటనే రావలసిన దని వ్రాసినయుత్తరము. ఖా నాయుత్తరమును జదివించుకొని విని “దీనివలన జనార్దనసిం గింకను కనోజునందే యున్నట్లు స్పష్ట మగుచున్నది. దుల్పట్‌షాను వంచింప నిదియే మంచితరుణము. మన మిప్పుడే త్వరపడవలె” నని యనుకొని యబ్దుల్‌ఖానుతో రేపే ఘుర్‌మండలముపై దాడిపెట్టుటకు సంసిద్ధులమై యుండవలె నని చెప్పెను. అప్పు డబ్దుల్‌ఖానుఁడు అజాపునిచెవిదగ్గర నోరు పెట్టి యేదియో రహస్యము మాటాడఁగా నతఁడు, నిర్బంధనమం దున్నహిందూసేవకుని జూచి “యోరీ! మాచేతిలోఁ జిక్కినావు. నీప్రాణరక్షణము మావలనఁ గావలెను. నీవు బ్రతికి బాగుపడవలె నన్న మాహితవును గోరి మాకు సహాయము చేయుము. నిన్ను ఘుర్‌మండలమునకు రాజుగఁ జేయుదుము. కాదంటివేని ప్రాణముపై నాస వదలుకొను” మని పల్కెను. ఆవాక్యము లాసేవకునకుఁ గొంతయాసను గలిగింప “ప్రభూ! నన్నుఁ గాపాడుడు. నేను నిర్భాగ్యుఁడను. మీ కేమి సహాయము చేయఁగలవాఁడను! ఇంతటినుండి మీయాజ్ఞానువర్తినై మీకు సేవ చేయువాఁడను. ఇది ప్రమాణవాక్యముగా భావింపుఁడు. నే నేమి చేయవలెనో సెలవిండు” అనెను. అజాపుఖానుఁడు వానికి రహస్యముగాఁ గొన్నిసంగతులు బోధించి, వాని కాస గల్గునట్లు కొంతద్రవ్య మిచ్చి తృప్తిపఱచఁగా నాసేవకుఁడు అజాపు నియోగించినయకృత్యమునకు నొప్పుకొనెను.

అంతట రహిమానుఖాను డచ్చటఁ బ్రవేశించి ప్రభువున కింకొకయుత్తరము సమర్పించెను. ఆయుత్తరములోనిసంగతులు విని “హా! దుర్గావతి బ్రతికియున్నదా? అల్లా నా కింక నాసను నిల్పినాఁడు. విక్రమాజితుఁడే కాక దుల్పట్‌షా కూడ నాకుఁ

బోటి తగిలినట్లు కనఁబడుచున్నది. అట్టిక్రమాజితుఁడే మనకడ గడగడలాడినాఁడు. వీఁ డనఁగా నెంత? రేపీపాటికి వీనిపొంక మడంపకుందునా? ఎన్నటి కైన దుర్గాపతిని బడయకుందునా?" యని బింకము పల్కి రహిమాన్ ఖానునకు సమస్తము నెఱుఁగ జెప్పి "ముల్పట్ పాను వంచించుటకు మొదటనుండియు పంతము పట్టినవాఁడవు నీవే. రేపు నీపంత మెట్లు నిల్పుకొందువో చూచెదను గాక! వాని నిర్జించి ఘుర్ మండలమునకు నీవు స్వతంత్రరాజువు కాఁగలవని నేను గోరుచున్నాఁడ" నని ప్రోత్సాహవాక్యములు పల్కెను. రహిమాన్ ఖానుడు తనయజమానునివాక్యముల కుప్పొంగి యాశాబద్ధుఁడై దీపశిఖ నాసించుశలభంబువోలె రిపరిపలాడుచుండెను. అబ్దుల్ ఖానుడు రాఁబోవుఘుర్మండలాధిపత్యమును దానే పొందుటకు వాంఛించి యుండుటచే రహిమాన్ ఖానునిమిడిసిపాటున కసహనమును జెందెను. అట్టియసహనము అబ్దుల్ ఖానుని కొన్నివాక్యములవలన అజాపునకు బోధపడఁగా నాతఁడు రహిమాన్ ఖానుని గాదని యబ్దుల్ ఖానునకును, అబ్దుల్ ఖానుని గాదని రహిమాన్ ఖానునకును వేర్వేఱ రహస్యములు చెప్పి యిరువురకు నాసలు నించెను. అంత సాయంకాలము కాఁగా అబ్దుల్ రహిమాన్ ఖాను లచ్చోటి నుండి వీడ్కొనిరి.

# ఇరువదిమూఁడవప్రకరణము

ధర్మదేవత పుష్పావతియొక్క శరీరభావ మడుగంటఁజేయ సౌభాగ్యవతీశాంత భావము సముద్ధరణము గాంచినరీతిఁ, జండభానుఁ డస్తమింపఁ బరిపూర్ణశీతకిరణుఁడు శుభోదయ మందె. ఆయ్యెడ సౌభాగ్యవతీసమాగమంబునఁ గనోజానగర మొందిన యమందపరిభలో యన, సాంద్రచంద్రిక లలముకొనియె. చల్లని తెల్లవెన్నెలలు నేత్రోత్సవంబుగఁ గాయ నుత్సాహము గాంచనివా రుండురా? చంటిపిల్లలు తమవచ్చియురాని ముద్దుపలుకులతో "దాయె! దాయె! చందమామ!" యని చిన్ని చేతులఁ జాచి మింటి చందురు నందుకొనఁ జూచుచుండిరి. బాలురు చెలఁగి యుప్పట్టి యాడుచుండిరి. బాలికలు వాకిలులయందుఁ జెమ్మచెక్క లాడుచుండిరి. రసికజనులు పొత్తుచెలియలఁ గూడి నెత్తమ్ము లాడుచు సరససల్లాపములఁ బరవశు లయి యుండిరి. తాతలు నడుము నిలువక వెన్నెలలో సాఁగి పరుండి, యప్పు లడుగు లొత్తుమంచ "నారీస్తనభరనాభీదేశం దృష్ట్వామాగా మోహావేశం ఏతన్మాంసవసాదివికారం మనసివిచింతయ వారంవారం" అని భజగోవిందశ్లోకములు పఠించుకొనుచుఁ గాలానుసరణవైరాగ్యమునఁ దృప్తులై యుండిరి.

పురజను లట్లశేషంబుగ మహోల్లాసంబున భాసిల్లుచుండ దుర్గావతికి స్వాంతంబున నేదియో యనుమాత్రవికారము దోఁచి కొంతవడి కంతన లేనిచింతవలె మాఱి, యంతఁతనె కొండంతై సంతతసంతాపమును గలిగించెను. ఆసంతాప మిట్టిదట్టి దని వర్ణింప నలవి గాదు. కాని దుర్భర మైనదారిద్ర్యముకంటె, దుస్సహ మైనశరీరదీర్ఘరుగ్ణతకంటెఁ గష్టతర మైన దని యనుభవజ్ఞులు కొందఱు వచింతురు. దానినే మన ప్రబంధకారులు శల్యబాధగాఁ బోల్చుచు నట్టిబాధను బ్రయోగించుకర్త యొక్కఁడో కనఁబడనందున నిర్వివాదముగ ననంగుఁ డని వచించిరి. అనంగుఁ డని వానిమహిమంబు తక్కువదియా? యౌవనవంతు లయినస్త్రీపురుషులను బరస్పరవియోగ మబ్బినప్పుడు చల్లని నిశాసమయంబునఁ బూవుచేఁ గొట్టి "అయ్యో" యనిపించు నట. వేయేల? సమరరంగమున సమస్తభీకరశాత్రవలోకంబును జీకాకుపఱిచి పోకార్చుధీరస్వాంత యైనదుర్గావతీకాంతయే వానిధాటి కోర్వలేక గటకటపడుచుండఁ దక్కినయబలల కింక దిక్కేమిటి?

అట్లు దుర్గావతి కంటికిఁ గూర్కు లేక శ్రమపడుచు నారాత్రిఁ గడపుచుండ, నంతఃపురజాలమార్గములనుండి నిశాంతశాంతపవమానములు తొందరపడుచు పైఁబడి పీడింప విరహతాప మోపఁ జాలక యెద్దియో నిశ్చయించుకొని సాహసవంతురాలు కావునఁ బ్రాసాదము గడచి వీధిలోని కరిగెను. అయ్యెడ ద్వారపాలురును, ఊరికాపరులును రాత్రియంతయుఁ దమవిధులను జాగరూకతతో నెరవేర్చుకొని, ప్రభాతసమయము గావున నింకఁ జోరభయ ముండ నేర దని యెంచి, నిర్భీతిగ గుఱ్ఱుపెట్టి యెక్కఁడివా రక్కఁడ నరుగులపై నిద్రించుచుండిరి. వీధిలో నేమనుష్యసంచారమును లేక నిశ్శబ్దముగ నుండెను. అంతఁ దంబుఱయొక్కతంత్రిస్వనముతోఁ దోడు గలసి "గోవింద రాం రాం గోపాల రాధారమణ!" యని విష్ణుసంకీర్తనము చేయుచున్నయొక్కశ్రావ్యగాన మప్పటి మందానిలప్రసారంబున దుర్గావతి చెవులకు సోఁకెను. సంగీత మప్పటిస్థితియం దామెకుఁ గొంత బాధకరంబుగ నుండినను సంగీతాసక్తి యగుటచే నంతమధురగాన మెవ్వ రొనర్చుచుండి రని నిదానముతో వినుచు నిలుచఁబడి చూచుచుండెను. అంతట నాపాట పాడుచున్నయొకభక్తుఁ డామెకుఁ దారసిల్లెను. దుర్గావతి యాభక్తుని జూచి "నీ వెవ్వరవు?" అని ప్రశ్నింప, నాతఁడు "అమ్మా! నే నొకదాసరిని. పెరుమాళ్ళను భజించుకొనుచు భిక్షాటనంబునఁ గాలక్షేపము సేయుచున్నవాఁడ" నని ప్రత్యుత్తర మిచ్చెను.

అనంతరము వారికిఁ బరస్పరసంభాషణ మీరీతి జరిగెను.

దుర్గా—ఈసమయంబున నీకు బిచ్చ మెవ్వ రిడుదురు?

దాసరి—అమ్మా! నేనీయూర బిచ్చమెత్తను. గ్రామాంతరమునకుఁ బోవువాఁడను.

దుర్గా—నీ వేగ్రామమున వసింతువు?

దాసరి—నే నీయూరికాపురస్థుఁడనే. మీరు నన్నెఱుంగరు. కొంతకాలము మీపోషణంబున నుండుటవలన మిమ్ములను మీయమ్మగారిని గూడ నెఱుంగుదును.

దుర్గా—మాపోషణమం దున్న నీ కీభిక్షాటన మేల యబ్బెను?

దాసరి—అమ్మా! మీనాయనగారికి నాదురదృష్టవశంబున నాపైఁ గోపము వచ్చి దేవిడీమన్నా చెప్పినారు. నాటనుండి యిట్లు కాలక్షేపము సేయుచున్నాను.

దుర్గా—నే నీసంగతి యెఱుంగను. ఎన్నఁడైన నీకు మేలు చేసెదనులే.

దాసరి—అమ్మా! మీదయ యుండిన నా కేమికొదువ? మీ రొంటరిగ నియ్యెడ వీధిలో నిలబడినా రేమి?

దుర్గా—మధ్యహిందూస్థానమున ఘుర్ మండల మున్నదఁట. నీ వెఱుంగుదువా?

దాసరి—అమ్మా! చాలసారు లాగ్రామమునకు సంచారము చేసితిని. మొన్ననే యొకసారి వెళ్ళి వచ్చితిని. నే నెఱుంగ కేమి?

దుర్గా—నే నిప్పు డచ్చటకుఁ బోవ నెంచితిని. నీతోఁ దీసికొనిపోయెదవా?

దాసరి—అమ్మా! నేను తిన్నగాఁ బోవను. అందంద సంచారము చేయుచుఁ బోవువాఁడను. నాసహాయము మీకు సరిపడదు. మీ రంతదూరము నడచుట యైనఁ గష్టమే. మీ కేదేనిపని యున్నయెడల నావలన నైనచోఁ జేతులు గట్టుకొని చేయుదును.

దుర్గా—దాసరీ! నీవు ఘుర్ మండలమునకుఁ బోయి యెప్పుడు తిరిగి వచ్చెదవు?

దాసరి—అమ్మా! యెల్లుండి తిరిగి వత్తును.

దుర్గా—ఘుర్ మండలము రాజుగారిని నీ వెఱుంగుదువా?

దాసరి—ఎఱుంగ కేమి? నే నెప్పు డచ్చటకుఁ బోయిన నగరునకు వెళ్ళక మానను. నా కేమి లభించిన నచ్చటనే లభించును. రెండు సేరుల బియ్యమునకుఁ దక్కువ దొఱుకదు. నేను నగరువాకిటకుఁ బోయి యేదేని యొకచక్కనికృతి శ్రుతి చేసికొని పాడఁగానే యాప్రభువు వచ్చి విని పైఁగా నొకరూపాయి నిచ్చుచుండును.

దుర్గా—అట్లయిన నీవు నా కొకసాయము చేయవలెను. చేయుదువా?

దాసరి—అమ్మా! తప్పక శిరసావహించెదను.

దుర్గా—ఇటఁ గొంచెముకాల మాగుము. ఇప్పుడే వచ్చెదను.

అని ప్రాసాదాంతరమున కేగి యొకలేఖ లిఖించి తెచ్చి యయ్యది ఘుర్ మండలాధీశుఁ డయిన దుల్పట్ షాకు నందఁజేసి, యాతఁ డిచ్చుటకు రానిచో జవా బైనఁ గొనిరమ్మని దాసరచేతి కిచ్చెను. దాసరి యచ్చోటునుండి వీడ్కొనఁగా దుర్గావతి తిరిగి నగరునఁ బ్రవేశించెను. అంతటఁ గొంతసేపటికిఁ బూర్తిగఁ దెల్లవారెను. కాని దుర్గావతికి మోహాంధకారము తెల్లవారనందున "నాయుత్తరము చూచుకొని దుల్పట్ షా తప్పుగా నెంచునో వచ్చునో రాఁడో? [illegible] మరలనుగల చింతించుచు, జవా బైన రాక మానువా? యని సంతుష్టి చెందుచు, ననేకవిధములచే మనస్థిమితము లేక, ఆహారము గొనక, నిద్రింపక, యొరులతో మాటాడక, దేహస్ఫురణ మెఱుంగక యుండెను. అనివఱ కట్టిమనోగతరహస్య మైనను జనార్దనసింగునకుఁ జెప్పక మానునది కాకపోయినను, తల్లి యని తెలిసియున్నగున నిప్పుడు తనమనోభిప్రాయ మెంతమాత్రము వెల్లడింప నామె సాహసింపనందునఁ దల్లియుఁ దండ్రియు నామెచర్యలవలన గాని స్తోకినట్లు మాత్రము భావించుకొనిరి.

# ఇఱువదినాల్గవ ప్రకరణము.

———(:)———

ఘుర్ మండలమునందు దుల్పట్ షా అజాఫ్ ఖానునివలన భయమునుండి దినదినము గండముగా దినములు గడపుచు జనార్దనసింగునకై క్షణక్షణము నిరీక్షించుచుండెను. అంత నొకనాఁ డుదయమునపూట సుమారు జామువొద్దెక్కినపైని యతఁడు జనార్దన సింగునకై యుత్తర మిచ్చి పంపి యున్న సేవకుఁడు త్వరితగతి నతనిసందర్శనము గావించి "ప్రభూ! జనార్దనసింగునకు మీ రిచ్చినయుత్తరము నిచ్చియుంటిని. ఆయుత్తరమును జూచికొని యాతఁడు నాతోఁ బయనమై వచ్చి యిప్పుడే మనగ్రామముపొలిమేరలో నేమికారణముచేతనో పడిపోయి ప్రాణము విడువ సిద్ధముగా నుండి సంజ్ఞచే మిమ్మును దీసికొనిర మ్మని నన్నుఁ బంపినాఁడు. ఆలస్యము చేసినఁ బ్రాణము నిలువదు. తక్షణమే రండు." అని చెప్పెను. ఆమాటలు విని దుల్పట్ షా వెంటనే చైతన్యముఁ బాసి యడుగులు తడబడ, నాసేవకుని వెంబడించి యవసానము సమీపించి యున్నతనమిత్రుని జూచుటకుఁ బోయెను. ఆసేవకుఁడు ప్రభువును వెంటఁ గొని ఘుర్ మండలమును వదలి సుమారు మూఁడుమైళ్ళదూర మరుగునంత నచ్చట నజాఫ్ ఖానుఁడు సిబ్బందితో నిల్చి యుండెను. మనోవిచారముచే దుల్పట్ షాకుఁ బ్రపంచస్ఫురణమే లేదు. అయ్యెడ రహిమాను అబ్దుల్ ఖానులు దుల్పట్ షాను బట్టుకొని బంధించిరి. అజాఫ్ ఖానుడు మహోత్సాహముతోఁ దనపరివారమును ఘుర్ మండలదుర్గములోనికి నిరాటంకముగ నడపి కోటను స్వాధీనము చేసికొనెను. దుల్పట్ షాతో నున్న సేవకుఁడు మరల నీతనికిఁ గనఁ బడనే లేదు. తురకలచేతులఁ బడినతనప్రాణము నిలువ దని భయపడుచున్నదుల్పట్ షా తనమిత్రునికై చింతించుటయు మఱచిపోయెను. అప్పట్టున అజాఫ్ ఖానుడు రమారమి మాసముదినములు ఘుర్మండలముకోటలోఁ దనపరివారముతో నివసించియుండెను. అంతవఱకు దుల్పట్ షా చెఱలో నుంచఁబడెను. ఘుర్మండలాధీశునిరాజ్యైశ్వర్యము నిరాయాసముగఁ దనకుఁ జిక్కినందున, అజాఫ్ ఖానునియప్పటిసంతోషమునకు మేర లేదు. ఘుర్మండల పౌరజనులు తన్ను మెచ్చువరఁ గొనియాడవలె నని, యడుగనివారికే పోవు మనునట్లు పేదలకు మూరబారల లొక్కటిగా నాలోచించి ధనములు పంచిపెట్టెను. గోచిపాత రాయల కెల్ల నుద్యోగము వచ్చెను. రైతులకుఁ బన్నులు తగ్గించెను. సంస్థానకులకుం

దదివఱకు పని చేయుచున్నయుద్యోగస్థులకు జీతములు వృద్ధిపఱచెను. పిల్లలకు మిటాయి పొట్లములు పంచిపెట్టెను. కావున నామాసముదినములు గ్రామస్థులకుఁ బెండ్లిదినముల వలెఁ దోఁచెను. ఆహా! పాపపుఁబౌరజను లదివఱకు పూర్వప్రభువునుండి యెన్నియో మహోపకారములు పొంది కొనియాడినట్టి నరము లేనితమనాలుకలను నంతలోఁ బెడ మార్గములఁ ద్రిప్పి, అజాఫ్ఖానుని విశేషముగ నస్నుతు భూషించుచుండిరి. అట్లు ఆజాఫ్ ఖానుడు తననూతనపరిపాలితజనంబులయభిమానగౌరవములు వడసి మహోత్సాహముతో ఘుర్మండలమునఁ దనజెండా నెగిరించుకొనుచుండెను.

అట్లు ఖానుసాహేబు మహావైభవోపేతుఁడై కొలువుకూటంబున స్నేహితవర్గంబు పరివేష్టింప, నొక్కనాడు వసించి, దుల్పటుసాతో నెకసక్కెయపుసంభాషణము గావింపఁ గౌతుక ముప్పతిల్ల, వానిని దోడ్తెమ్మని రహిమానుఖానునకుఁ జెప్పెను. ఖానుగారిసంకల్పము రహిమానుఖానునకు సంతోషకర మైనదే కావున వెంటనె బంధనాలయమునకుఁ బోయి తానే స్వయముగాఁ దలుపు తెఱువఁబోఁగా దుల్పటుషా లోననుండి యినుపకడ్డీలనడుమఁ జేయి చొన్పి రహిమానునిగడ్డము గట్టిగాఁ బట్టి బిగలాగి జాడించెను. అంత రహిమానుఖానుడు కుయ్యో మొఱ్ఱో యని బొబ్బ లిడుచుండ దగ్గర నున్నకారాగృహాధికారియుఁ గొందఱు సేవకులు వాని నాపదనుండి తప్పించిరి. పిమ్మట దుల్పట్షా సంకెలలతో నాస్థానమునకుఁ దీసికొనిపోఁబడెను. అతఁడు సభాభవనమునఁ బ్రవేశింపఁ దా నదివఱకు స్నేహితు లని భావించుకొనినవారు కూడ తనయం దభిమానము గలవారివలె నతనికిఁ గన్పట్టలేదు కాని ఆజాపునకు మాత్ర మాతనిదుస్థితి కొంతవిచారమును గల్గించెను. మోమోటమును నతిశయిల్లెను. అయ్యెడ ఆజాఫ్ ఖానుడు దుల్పట్షాతో ని ట్లని ప్రసంగించెను:—

ఆజాఫ్—దుల్పట్! నీవు విచారించకుము. నీవు మాకొలువునఁ బ్రవేశింపుము. కూటికి గుడ్డకు లో టుండదు.

దుల్పట్—అయ్యా! ఆత్మగౌరవ మున్నఁ జాలును. కూ డేల? గుడ్డ యేల? పూవు లమ్మినయూరఁ గట్టె లమ్మువెళ్ళు లుందురా? మీదయ యుండిన నంతియ చాలు.

ఆజాఫ్—ఓయీ! అదే పో. నీరాజ్యమును నీ వేలుకొనియెదవా?

దుల్పట్—నారాజ్యమే యైనచో దానియంతట నదియే నాకు మరలఁ బ్రాప్తించును. లేనిచో లేదు.

అంతట రహీమాన్ ఖానుఁడు లేచి "ప్రభూ! వీనితో సంభాషణ మేమిటికి? ఈతఁడు తల్లికడుపులోఁ జెయ్యి పెట్టుకొనువాఁడు. మనలో నున్నట్టె యుండి మీరు కోరినదుర్గావతిని పెండ్లియాడఁ జూచినాఁడు. అందుచేతనే కదా యీయుద్ధమున మనకు ద్రోహము చేసినాఁడు. ఇట్టివానిని వెంటనే ఖండింపుఁడు. మీరు ఖండింపలేనిచో నన్నందుకు నియోగింపు" డని రోషవాక్యముల బలికెను. అజాఫ్ ఖానుఁడు దుర్మార్గులలోఁ గొంచెము మంచివాఁడు కావున రహీమానునిప్రోత్సాహమువలనఁ దొందర చెందక యాతనిని గొంత శాంతింపఁ జేసి దుల్పటుఖానుతో మరల నిట్లు పలికెను.

అజా — నీ కింకను రాజ్యమునం దపేక్ష కలదా? దుర్గావతితో రాజ్యభోగ మనుభవింపవలె నని యనుకొంటివా?

దుల్ప — ఆహా! రహిమాను ఈర్ష్యచే నాపైఁ జెప్పినయక్రమవాక్యములు మీరు నమ్మవలసినవి కావు. నే నెక్కడ? దుర్గావతిని పెండ్లియాడుట యెక్కడ?

అజా — నీకును దుర్గావతికిని నీవల కందువిషయమై యుత్తరప్రత్యుత్తరము లెన్నఁడైన జరగలేదా?

దుల్ప — హాహా! యెన్నఁడును జరుగలేదు.

అజా — అటులైన నీ కామె యీయుత్తర మెట్లు వ్రాసినది? చూడుము. (అని యొకయుత్తరమును జేతి కిచ్చెను.)

దుల్ప — (ఆయుత్తరము చదువుకొనఁగా నయ్యది దుర్గావతి తనకు వ్రాసిన మోహలేఖ యగుటవలన "ఇయ్యది నిజముగా దుర్గావతి వ్రాసి యున్నదా? లేక యామె పేరు పెట్టి రహీమానుఁడు వ్రాయించి యుండునా?" అని సందేహించి స్త్రీ యొక్క దస్తూరితో నున్నందున నేమియుఁ జెప్పఁ జాలక యెట్టకేలకు) "నేను నామెను నెఱుంగకపోయినను, నామెదస్తూరి యెటు లుండునో యెన్నఁడు జూడకపోయినను స్త్రీచే వ్రాయఁబడినట్లు కనఁబడినందున నామెయే వ్రాసియుండవచ్చు నని నేనును దలంప నవకాశము గలదు" అని పలికెను.

అజా — నీ వామెకుఁ దొలుత మనోగత మెఱిఁగించి యుత్తరము వ్రాయకున్న స్త్రీ యైనయామె నీ కిట్లు వ్రాయ నెట్లు సాహసించినది?

దుల్ప — అయ్యా! ఆమెను నాకు సమకూర్చు మని వెనుక నెన్నియో సారులు మీరు నాకుఁ జెప్పియుండ, నామెకు నాకు నుత్తరప్రత్యుత్తరములు జరుగుటలేదె

పరిచయ మున్నచో, మీకోర్కె నెరవేర్చి మీయనుగ్రహమునకుఁ బాత్రుడను గాక యుందునా? నా రాజ్యమున కీ క్లేశ దూర మగుదును?

అజా—మించిన దేమి యున్నది? ఈయుత్తరము నిస్సంశయముగ నా మె వ్రాసినదే. దీని నెట్టులో మేము సంగ్రహించితిమి. ఇప్పుడైన నీ వా మెను నాకు సంధానము చేయుము. నీ రాజ్యము నీ కిచ్చివేయుదును.

ఆమాటలు విని రహిమాన్ ఖానుడు తా నేలఁ దలఁచిన ఘుర్మండలరాజ్యము తనకు దక్క దనుసంశయముచేతనను, దుల్పటుషా పైఁ దనకు మొదటినుండి యుండినకార్పణ్యము వలనను, రౌద్రముతో నిలువఁబడి "ప్రభూ! వీనిచేత నే మౌను? దుర్గావతిని నేను మీకు సంఘటింతును. వీని నిప్పుడు చంపివేయుడు. ఘుర్మండలాధిపత్యము నాకే దయ చేయుడు." అని అజాఫ్ ఖానునకు విన్నవించెను. అదివఱకుఁ జాలకాలమునుండి దుర్గావతిని సంధానము చేయఁ గలఁ డని యజాఫ్ ఖానుఁడు సందేహించి దుర్గావతికైయే క్రిందుమీఁదలఁ బడుచున్నవాఁడు గావున నెట్టు లయిన నామె లభించినఁ జాలు నని దుల్పట్ షా రహిమాన్ ఖానుల నిర్వురతో "మీలో నెవరు ముందు దుర్గావతిని నాకు సమకూర్తురో, వారికే ఘుర్మండలాధిపత్యము నిచ్చెద" నని చెప్పి యొకరితో నొకరికిఁ బోటీ నిల్పెను. రాజ్యము లేకపోయినను దురకలచేతులలోనుండి యెట్టులైనఁ దప్పించుకొని ప్రాణము నిల్పుకొనవలె నని దుల్పట్ షాయు, ఘుర్మమండలాధిపత్యమును దానే పొందవలయు నని రహిమాన్ ఖానుడును, దలంచి నేను నే నని యిర్వురును సంసిద్ధు లయిరి. అజాఫ్ ఖానుడు వీరిలో నెవ రైన దుర్గావతిని దనకుఁ జేకూర్ప కుందురా యని ధైర్యము తోఁచి యుభయులను మీమీప్రయత్నములలో మీ రుండు డని సెల వొసంగెను.

# ఇరువదియైదవ ప్రకరణము.

తాపసు డట్లు కనోజుప్రాసాదాంతరమున వసించియుండ సౌభాగ్యవతి యాతని వృత్తాంత మామూలాగ్రంబుగ సంగ్రహించి, యెంతయో చింతించి "కృతఘ్నుఁ డైన సేవకుఁడు నిన్ను మోసపుచ్చెను. కాని జనార్దనసింగునినిజమైనవృత్తాంత మిది'' యని యెఱింగింప నాతఁ డామెకు నమస్కరించి కొనియాడెను. కృతజ్ఞురాలు గావున నామె "కానిమ్ము. సుఖదుఃఖము లేకనీవిని నుండవు. నీ విట వసింపుము. నీ కేలోప మును నుండఁ బోదు,'' అని వచించి, దుర్గావతి కాతనియందుఁ గలయనురాగ మామె సంచారిభావములవలన నావఱకే యెఱింగియున్నందున, నాతపస్విని దన కల్లునిగాఁ జేసి కొన సంకల్పించుకొని యతిగౌరవముతోఁ బూజించుచుండెను. దుర్గావతికిని నాతనియం దంతకంతకు నిలుపరానిప్రేమోహము జనింపఁ దల్లికిఁ దనమనోభీష్టము స్పష్టముగాఁ దెలియఁబఱచెను. తదుపరి నొక్కనాఁడు సౌభాగ్యవతి నిజేశునకుఁ దపస్వివృత్తాంత మంతయుఁ జెప్పి తనమనస్సంకల్పమును దెలియఁజేసెను. చందనుఁడు "దేవీ! నీసంకల్పము యుక్త మైనది కాదు. ఆతఁ డుత్తమకులక్షత్రియుఁడు గాఁడు. వానితో సంబంధము నకు మనబంధువర్గ మంతగా హర్షింపదు.'' అని వ్యతిరేకవాక్యములు పలికెను. సౌభా గ్యవతి, "యోగ్యత వేయిరెట్లొప్పియున్నప్పుడు కులమతంబు లంతగాఁ బాటింపరాదు. దుర్గావతియు నాతని నే వరించె'' నని ప్రతిభాషలాడఁ జందనుఁడు "ప్రేయసీ! కులము మాట యటుండ నిమ్ము. ఆతఁ డెంతసుగుణవంతుఁ డైనను, మన కెంతయాంతరంగికుఁ డైనను, రాజ్యభ్రష్టుఁడు గదా? చూచిచూచి బంగారపుఁగత్తి యున్న దని కుత్తుకఁ గోసికొందురే?'' యని వచించెను. సౌభాగ్యవతి "తనువులు శాశ్వతములా? యైశ్వ ర్యములు శాశ్వతములా? మన కేమి పదిమంది యున్నారు? దేవుఁ డేమి యిచ్చి యున్నాఁడో యయ్యది మనకును మననుతకును ననుభవింపఁ జాలదా? బ్రతుకు బాగుండిన, వారలు రాజ్యమే సంపాదించుకొనలేరా? నేను మీకుఁ దోడై, పోవలసిన రాజ్యమును నిల్పలేదా? మనకొక్కర్తుకయే పుత్త్రిక. ఆమెమనోభీష్టము మనము నెఱవేర్పక తప్పదు'' అని గట్టిపట్టు పట్టెను. చందనుఁ డిల్లాలియాదేశమునకు మాఱాడలేక యెట్టకేలకుఁ దానును దలయూచెను.

తరువాత నొక్కశుభలగ్నంబున సౌభాగ్యవతీదండనులు తమపుత్త్రిక దుర్గావతిని నారాజతనయునికి మహావైభవముతోఁ గన్యాదాన మొసంగి, యాతని నిల్లరిక ముంచుకొనిరి. అంత దుర్గావతి కింతింతనరానిసంతసము స్వాంతంబున నెలకొనియెను. కాని, యిట్లు దనభర్త యిల్లంట్రి యుండుట యామె కెంతమాత్రము సంతుష్టిని గలిగింపనందున, గఢ్ మండ్లరాజ్యమును దిరిగి సంపాదించుకొను దృఢసంకల్పమును గలిగియుండెను.

## ఇరువదియాఱవ ప్రకరణము.

అజాఫ్ ఖానుఁడు ఘుర్మ్మండలమున వసించియున్న కాలములో నొకనాఁడు సాయం సమయమున, రహిమాన్ ఖానుఁ డొకపల్లకి తన్ను వెంబడించి వచ్చుచుండఁగా గుఱ్ఱము నెక్కి మహోత్సాహముతో ఘుర్మ్మండలప్రాసాదమును సమీపించెను. అయ్యెడఁ బ్రాసాదాంతరమున వసించియున్న అజాఫ్ ఖానుడు, పల్లకిమ్రోఁత విని బయటికిఁ జూడ వచ్చినంత, రహిమానుఖానుడు పల్లకితో లోనఁ బ్రవేశించి "ప్రభూ! ఇదిగో దుర్గావతిని సమాధానపఱచి తీసికొనివచ్చితిని." అని పల్లకితలుపు తెఱచెను. అంతఁ బల్లకిలోనుండి యొకబోఁటి మేలిముసుఁగు వేసికొని వెలికి వచ్చి నిలువఁ గొందఱుపరిచారికలామెను నంతఃపురంబునకుఁ గొనిపోయిరి.

అయ్యెడ అజాఫ్ ఖానుఁడు సంతోషమువలన మైమఱచి, స్నేహితవర్గంబునకు వీడ్కొన సెలవైన నొసంగక, వడివడి నంతఃపురంబునకు దుర్గావతీసంసర్గమును గాంక్షించి పోయెను. అతఁడు మోహదృష్టుల నాదుర్గావతిని వీక్షింప నామె లోకము గొనియాడుచున్నంత సౌందర్యవతిగాఁ గన్పట్టలేదు. కాని యామె టెక్కులాడిచేయువులు పురుషులకు వలపులు నింపఁ జాలియున్నవి. కావున మోహపరవశుఁ డైనయాతఁడు పటాలున నామెను గౌఁగలించుకొనెను. అంత నాదుర్గావతి లజ్జావతి గాక ప్రౌఢవలె ఖాను సాహేబును దనచాకచక్యమువలనఁ గరఁచెను. ఖానుగా రంత సంతుష్టిఁ జెంది యారాత్రి యంతయు నామెతోఁ గడపి మఱునాఁడు రహిమాన్ ఖానుని మెచ్చి ఘుర్మ్మండలరాజ్యమున కాతని నభిషిక్తుఁ జేసెను.

దుల్పట్ షా తురకలరాజ్యములలో వసించుట యెన్నఁ డైనఁ బ్రాణాపాయకర మని యెంచి, రాజ్యమునందాస వదలుకొని, తాపసవేషముఁ దాల్చి కనోజాపట్టణమునఁ జేరి కాలము గడపుచుండెను. ఆహా! దుర్మార్గులను శ్రీమంతులుగఁ జేసి, సజ్జనులను దరిద్రులుగ నొనర్చి బాధలు పెట్టుకలికాలమాహాత్మ్య మేమి చెప్ప నగును?

అనంతరము అజాఫ్ ఖానుఁడు తనదుర్గావతిని బల్లకిలోఁ గూర్చుండఁ జేసి, తా నొకగుఱ్ఱముమీఁద నెక్కి యనుచరవర్గముతో కలింజరునగరమునకుఁ బయానమై పోయెను. అచ్చట ఖానుగారిదుర్గావతి సమస్తభోగములనుభవించుచు, నట్టిభర్త లభించుట తన యదృష్టమే యనుకొని యుప్పొంగుచుండెను.

## ఇఱువదియేడవప్రకరణము.

---(:)---

ఎన్నటి కైన ధర్మము జయమును గాంచక మానునా? రహిమానుఖానుఁ డట్లు మహావైభవోపేతుఁడై మన్నుమిన్నులు గానక ఘుర్మండలమునఁ దనపరిపాలనము సాగించుకొనుచుండఁ గొలఁదికాలముననే యతనిదుర్న్యాయపుఁజర్యలవలనఁ బరిపాలితజనులందఱ కాతనియం దనిష్టము జనించెను.

అంతట "మొహరమ్" అనుతురకపండు వొకనాఁ డాసన్న మయ్యెను. ఆపండువు దినంబునఁ దురకలందఱుఁ దమ కున్నవానిలో విలువైనవింతదుస్తులు ధరించి, కైపుపదార్థములు సేవించి, యొకతెఱుంగనిమహోత్సాహముతోఁ జెలంగిరి. తురకలు హుక్కా-పీల్చుచుండఁ జెలరేగినవాసనలు పురజనులముక్కులకు గుప్పుగుప్పునఁ గొట్టుచుండెను. గొడ్డుమాంసమునఁ గలసి పులావు లుడుకుచుండఁ దెరతెరలుగ గుబ్బవాసనలు పురంబున నెల్లెడల నలముకొనియెను.

ఆనాఁడు నిశాసమయంబునఁ గోటలోనితురకజనము సేవించినమత్తుపదార్థముల వలనను, భుజించినపులావుగురుత్వమువలనను గదలమెదల జాలక పరుండి నిద్రించుచుండిరి. రాణివాసమునం దున్నబీబీలును లంగాలు పైకెగఁబడ నొడ లెఱుంగక పడియుండిరి. అప్పుడు యౌవనవంతులైన స్త్రీపురుషు లిర్వురు కత్తినతత్తడుల నెక్కి పదివంది యాయుధపాణు లైనయనుచరులతో దుర్గద్వారముఁ బ్రవేశించి, గోడెంబుతురకల నందఱను గుఱికలి నఱకుచు నంతఃపురంబులఁ జొఱఁబడిరి. అయ్యెడ రహిమాన్‌ఖానుడు తనబూబుతోఁ గలసి మంచముపైఁ బవ్వళించి కుంభకర్ణునినిద్రం దేలుచుండెను. దుల్పటుషా రహిమానునిశిరస్సు ఖండింపఁబోఁగా దుర్గావతి ధర్మము చెప్పి మాన్పించి, గోడ నున్నచిలుకకొయ్యకుఁ దగిలించియున్న సాహేబుగారియొక్క పాదవైనతలగుడ్డను దీసి దానితో తురకదంపతుల మంచముతోఁ గలిపి బంధింపఁ జేసెను.

అంతఁ దెల్లవారఁగా దుల్పటుషా తనప్రభుత్వమును బ్రజలకుఁ జాటింపఁ జేసి తురకపీనుఁగుల స్మశానవాటికకు నీడ్పించి, బూబుతో రహిమాన్‌ఖానుని జెఱలో నుంపించెను. పౌరజనులు తమపూర్వప్రభుపాలనము తమకు మరల లభించినందుకు మెంతేని సంతసించిరి. పిమ్మటఁ బురోహితజనంబును రావించి, ప్రాసాదాంతమునఁ

బుణ్యాహవాచనము చేయించి యాగ్రాంతిలో దుల్పట్‌షా సుఖలీలల మహావైభవ మనుభవించుచు నసించెను. నేటితో దుర్గావతిమనంబునకుఁ బరిపూర్ణసంతృప్తి ప్రాప్తించెను. సౌందర్యవతియు, శౌర్యవతియు, విద్యావతియు, సుగుణవతియు, సామర్థ్యవతియు నైనదుర్గావతీసతీమతల్లి తన కిల్లాకై గాఢానురాగమునఁ బాతివ్రత్యము నడపుచుండ నయ్యెడ దుల్పట్‌షా యనుభవించుభోగము మహేంద్రభోగము, నానందము బ్రహ్మానందము గాదా? దుల్పట్‌షాకు జయ మొసంగినది ధర్మమే కదా?

అట్లు దుర్గావతియు, దుల్పట్‌షాయు ధర్మము ననుసరించి ప్రజానురంజకంబుగ, శత్రుభయరహితంబుగ రాజ్యపాలనము సేయుచు నొక్కనాఁడు చెఱసాలలోనినిర్భాగ్యులను జూడఁ బోయిరి. అచ్చటఁ గోట లూడఁదీసినకోతిపిల్లలవలె నున్న రహిమాన్‌ఖానుఁడును, కడు శుష్కించియున్నయాతనిబిడ్డయు వారల కగపడిరి. దుర్గావతి కనికరము గలది కావున బాలికయొక్కదురవస్థఁ జూచి యామెను విడుదల చేయించెను. తఱువాత నాబిడ్డ దీనాలాపములచేఁ దనభర్తయొక్కయపరాధములు మన్నించి చెఱనుండి విముక్తి గలిగింపు మనియు, నాతఁ డెన్నఁడికముందు వారి కేయపకారము తలంపఁడనియుఁ వేడికొని, రహిమానుని వారిక్షమాపణమును గోరినవానిగాఁ జేసెను. అందుపై దుల్పటుషాయును నక్కటికము జనింప రహిమానునిమీఁదనేరములు గొఱిగించి బంధవిముక్తిని జేసెను. తనకుఁ గల్గినయపరాభవమునకు రహిమానుఁడు దుఃఖించుటకు మాఱుగా దాను మోసము చేసిన అజాఫ్‌ఖానునిచే నెఱుంగఁబడక యీవికృతరూపముచేఁ గొంతకాలము సంచరింపవచ్చునని సంతుష్టిఁ జెంది భార్యతో నాపురంబును విడచి చనియె.

# ఇరువదియెనిమిదవప్రకరణము.

———(:)———

దుల్పటుషా తనరాజ్యమును దిరిగి స్వాధీనము చేసికొన్నతరువాత నొక్క దినంబున నపరాహ్ణము సగము జరిగినపైని నొక్క ముండిత, కళింజర్ ఘుర్ మండలములకు నడుమ నున్నయొకమామిడితోటను సమీపించుచుండెను. తల వలిమిడిముద్దవలె నున్నఁగాఁ గాన్పించుచున్నందున నామె క్రొత్తగా ముండనమును బొందినట్లు స్పష్టమగుచున్నది. నామెయు ముప్పదిసంవత్సరములవయసు గలది. నవికముఁ జెంది నవనవలాడునామెశరీరమునన్నచ్ఛాయ యామె మహైశ్వర్యభోగమును గొంతకాల మనుభవించిన దని విశదీకరించుచున్నది.

ఆమె యావనంబునఁ బ్రవేశించి, ఘుర్ మండలపురంబులోనికిఁ బోవుదునా, మానుదునా యని యాలోచించుచున్నంత, నందు వసించియున్న యొకవానప్రస్థుఁ డామెకుఁ దారసిల్లెను. ఆతఁడు ముప్పదిసంవత్సరములప్రాయమువాఁడు. బలాఢ్యుడు. వన్నెకాఁడు. ఆతఁ డాబోడమ్మకుఁ బరిచితునివలెఁ దోఁపఁ బరికించి పరికించి "దామోదరా! నీ వింతనిర్భాగ్యుఁడ వేల యైతివి? నీఘుర్ మండలాధిపత్య మే మయ్యె" నని యడిగెను. అందుపై వారిరీతినిఁ బ్రసంగించుకొనిరి.

వాన—నీవు నన్నెట్లెఱుంగఁ గల్గితివి? నాకు ఘుర్ మండలాధిపత్య మేమిటి?

ముండిత—ఘుర్ మండలాధిపత్యమునకై నీవు ఖానుగారిని నాశ్రయించి యొకప్పుడు తిరుగలేదా?

వాన—ఎన్నఁ డాశ్రయించితిని?

ముండిత—కళింజర్ పురమున నుద్యానంబున ఖానుగారు విహరించుచుండ "మీమాటలు నమ్మి స్వామిద్రోహదోషమున కొడిగట్టికొంటిని. ఘుర్ మండలాధిపత్యమా నా కిచ్చెద మని రహీమాన్ సాహేబుగారి కట్లిచ్చితిరి?" అని యాతనిని నీవు నిష్ఠురోక్తు లాడలేదా? అందుకు ఖానుగారు "దామోదరా! నీవు నామాట విని స్వామిద్రోహము చేసి పాపము మూటగట్టుకొనుట నిజము. నీవు కోరినవిధముగాఁ గాక మఱియొకరీతిని నీ కందుకుఁ బ్రతిఫలము లభింపఁ జేసెదనులే" యని నీకుఁ దృప్తిపఱచలేదా? జ్ఞాపకమునకు వచ్చినదా?

అప్పుడు దామోదరుఁడు "నేను ఖానుగారితో మాట్లాడునప్పు డచ్చట నాతఁడును, నాతనిభార్య దుర్గావతియు మాత్ర ముండిరి. నారహస్య మెఱుఁగఁ గల్గినయామె యెవ్వతె యై యుండు" నని యనుకొని యాపె నింకఁ బరికింపఁ బరికింప ఖానుగారి దుర్గావతియొక్క పోలిక యామెముఖమునం దాతనికిఁ గన్పట్టి చూడఁజూడ నామెయె యీమె యైనట్లు నిస్సంశయముగఁ దోఁచెను. అంత వారి కిట్లు ప్రసంగము జరిగెను.

దామో—అవునవును. మాటలే కాని తురకవాఁడు హిందువుని బాగు సేయునా?

ముండిత—వెఱ్ఱివాఁడా! వారిని వీరిని నన నేల? మనము చేసికొనినదే మన మనుభవించునది.

దామో—నీ వాడునది నిజము. తురకలమాటలవలన నాసఁజెంది, జనార్దనసింగు చచ్చిపోవ నున్నాఁ డని మోసపుమాటలు చెప్పి, నాకు మహోపకారము లెన్నియో చేయుచువచ్చిన దుల్పటుపాను తురకలచేతి కొప్పగించితిని. ఆతఁడు మరల మహారాజువలె నున్నాఁడు. నే నాతనిమో మిప్పుడు చూడలేక నా కున్నబంట్రోతు నౌకరీ కూడ చాలించుకొని రెంటికిం జెడినరేఁడనై బాధలు పడుచుంటిని. నామాట యటుండ నిమ్ము. నీవు ఖానుగారికిఁ బ్రియమైనకొత్తయిల్లాలివి కదా! నీ కీగతి యేల యబ్బెను?

ముండిత—స్వామిద్రోహులకింతకంటె మంచిగతి యబ్బునా? అబ్బిననిలుచునా?

దామో—నే నేమో స్వామిద్రోహము చేసితిని. నీ వేమి చేసితివి?

ముండిత—నేనును నీ వనుభవించుచున్నస్వామిద్రోహదోషఫలమునే యనుభవించుచున్నాను. వెనుక నొకయిల్లాలికడ నమ్మకము పుట్టఁ జరించి యొకగట్టివాయి ప్రేరేపణముచేఁ గపటవేషముఁ బూని యామెభర్తచే గంగలోఁ ద్రోయించితిని. ఆయిల్లాలు తిరిగి మహారాణి యై పదిమందిని బెంచుచున్నది. నే నామెమోమును జూడలేక నలుగురిలోఁ దల యెత్తుకొని బ్రతుకలేక యెన్నెన్నియో విధముల దాగికొనుచు దినములు గడపుచుంటిని. ఈనడుమ నాలుమాసములపాటి నడుమంత్రపుసిరి ఖానుగారియిల్లాలినై యనుభవించితిని. కాని అబ్దుల్ ఖానుడు రహీమాన్ ఖానునిమీఁదిద్వేషమున నారహస్యమును బయటఁ బెట్టెను.

దామో—అబ్దుల్ ఖానుడు వెల్లడించిననీరహస్య మేమిటి?

ముండిత—రహీమాన్ ఖానుడు నన్ను అజాఫ్ ఖానునకుఁ దార్చునప్పుడు నేను దుర్గావతి నైనట్లు వానికిఁ జెప్పియుండెను. నేనును గానికూఁతు నన్నను గనుక పైన నిండు నని యూహించి నా పేరు దుర్గావతి యనియే ఖానుగారికిఁ జెప్పితిని. అందుచే

వ స్నాతఁ డంగీకరించినాఁడు. ఇప్పుడు దుల్పటుపా దుర్గావతిని పెండ్లియాడి ఘుర్ మఁడలమునకుఁ దీసికొనిరాఁగా నావిషయ మబ్దుల్ ఖానుఁ డెఱింగి, రహిమాను డొనర్చిన మోస మిది యని ఖానుగారికి విశదీకరింప నాతఁడు నాపైని గూడ కసలి యావిశ్వత రూపమును నాకుఁ గూర్చి పరాభవించెను.

దామో—ఆహా! రహిమాన్ ఖానుడు నాడు ఖానుగారిని నిటుల నాబుట్టలోఁ బెట్టినాఁడు? తొత్తుకొడు కెంతవన్నుగడ పన్నినాడు. ఖానుగారు నా కిచ్చెద నని వాగ్దానము చేసినఘుర్ మండలపరిభుత్వముఁ మాయ చేసి తాను బొందియుండెను. కాని యేమి బాగుపడినాఁడు?

ముండిత—ఎన్నఁడును దలకుఁ దగనిదురాసలు కూడవు. అట్టియాసలు గలవా రటులనే చెడిపోదురు. నే, నంతపెద్దకాపురమున కాసఁ జెందితిని. ఇప్పుడు నాస్థితి యె ట్లున్నదో చూచితివా? ఇంక నాగతి యె ట్లుండునో?

దామో—నిన్నుఁ బెండ్లియాడినభర్త యున్నాఁడా?

ముండిత—నేను గాపురమునకు వెళ్ళకముందే యాతఁడు మృతి చెందినాడు. ఆతఁడే బ్రతికియున్న ఖానుగారికై నే నాసపడుదునా? నా కీపాట్లు వచ్చునా?

దామో—నీకు దిక్కుగుబంధుగు లెవ్వరైన నున్నారా?

ముండిత—ఎవ్వరైన నుండినచో నింతచింత యెందుకు?

అని విచారించుచుండఁగా దామోదరుఁడు "నేనును నీమెవలెనే దిక్కుమాలి యున్నాను. ఇంక నే నీమెకు దిక్కు. నా కీమె దిక్కు." అని మనంబున నెన్నెన్నియో యాసలు గలిగియుండెను. కాని తనయుద్దేశ మామెకు నెఱింగించుటకు జంకి, యెట్టకేలకు "మనమిర్వుర మొక్కటేరుననే యున్నాము. భగవంతుఁడు మనల నిర్వురను గడునేర్పుతో నిచ్చట సమావేశము చేసెను. మనలో నొక రొకరికిఁ దోడు బాగుగఁ గలసినది. ఈడుజోడు కూడ నమరియున్నది. నీవు నాకు దిక్కగుము. నేను నీకు దిక్కగుదును." అని యామెకుఁ జెప్పెను. తలలు బోడు లైనఁ దలఁపులు బోడులా? బోడమ్మయును నాతనిభావము నెఱింగినజాణ యగుటవలన నేదియో యొకగోడ చేరు వుండవలెను గదా యని తలంచి యాతనియండ నుండుటకుఁ గాంక్షించి, యీతఁడు నన్నుఁ బోషింపఁగలఁడా యని శంకించి "పోనీ రాణిదుర్గావతి వెనుక నొకసందర్భమున నాకు మేలు చేసెద నని చెప్పియుండెను. ఆమె నాశ్రయించిన మా కిరువురకు జీవనము జరగకుండునా?" యని తృప్తిఁ జెందెను.

# ఇరువదిదొమ్మిదవప్రకరణము.



దుర్గావతీ దుల్పట్‌షాలదాంపత్యముఁ జూచియు, వారిరాజ్యవైభవముఁ గాంచియు అజాఫ్‌ఖానుడు ఓర్వలేమి జనింప దుల్పట్‌షా నెట్టులైన వంచించి వాని పట్టుమహిషిని బడయుటకు దృఢసంకల్పము గలిగియుండెను. కాని వానికిఁ గుడిభుజము వంటి రహిమానుఖానుడు తానొనర్చిన మోసము ఖానుగా రెఱింగియుండి రని వాని మోము చూచుటకు సంకోచించి మూఁడుసంవత్సరములపాటాతని కగపడక మూల మూలల దాఁగికొని యుండెను. ఎడమభుజమువంటి అబ్దుల్‌ఖానుడు ఘుర్మమండలాధిపత్యమును దన కియ్యక రహిమాన్‌ఖానున కిచ్చియుండుటచే అజాఫును దొల్గిఁటియు ట్లాశ్రయించుట మానెను. అంత దురాలోచనములు చెప్పువారు లేక అజాఫ్‌ఖానుడు ఱెక్కలు లేనిపక్షివలె వ్యర్థుఁ డయ్యె. అదియును గాక దుల్పటుషాకు దుర్గావతి రాణియై సమస్త రాజ్యవ్యవహారములు చక్కఁబెట్టుచున్నయాకాలమున నెట్టిబలవంతులైనను ఘుర్మండలము పేరు చెప్ప గడగడ వడఁకుచుండెడివారు. అప్పటికిని అజాఫ్ ఖానుడు తనపట్టుదలను విడువక శక్తివంచన లేక యవకాశము గల్గినప్పు డెల్ల దుల్పటు షాపైఁ జక్రవర్తికడ మిత్రభేదములు కల్పించుచుండెను. అట్లు మూఁడుసంవత్సరములు గడచెను. అజాపునిప్రతిన నెఱవేరలేదు. ఆలోచనము చెప్పరహిమాన్‌ఖానుడు లేడన్నచింత యప్పుడప్పుడు వానిని బాధించుచుండెను.

అంత ఢిల్లీయాస్థానమునుండి యొకసేవకుఁడు అజాపునిసన్నిధికి వచ్చి యొక కాగితమును ఖానునకు సమర్పించిపోయెను. దానిని అజాఫ్‌ఖానుఁ డిట్లు చదువుకొనెను. “సుబేదారు అజాఫ్‌ఖానునకు, పాదుషా హుమాయూన్ వ్రాయించినఫర్మానా:

దుల్పట్‌షా తన్నుఁ జెఱపట్టి మానభంగము గావించినాఁ డనియు నింక నాతని యంతఃపురములయం దిరువురుముసల్మాన్ యువతులు చిక్కుకొనియున్నా రనియు, మొగలాయిబూబుల మానభంగమునుండి కాపాడవలె ననియు, నొకబూబు మొఱ్ఱవెట్టుకొనుచు మాదర్బారునకు వచ్చియుండెను. దుల్పటుషా చేయుచున్నయీయక్రమమును మనము వారింపక తీరదు కావున, నీవు ఢిల్లీపౌఁజులసాయముఁ బొంది ఘుర్మండలముపై దండెత్తి యచ్చట నసహాయులై యున్నబూబులబాధలు తప్పించవలసియున్నది కావున తోడనే మాహుకుమ్ అమలు జరగించుట కిందుమూలముగా నాజ్ఞాపింపఁబడుచుంటివి.”

డిల్లీహుజూరు. హుమాయూన్.

అట్లు ఫర్మానా సాంతంబుగఁ జదువుకొని అజాఫ్‌ఖానుడు మహోత్సాహముతో మిన్ను ముట్టుచుండ, నొకబూబు వానియెదుటకుఁ బోయి సలాము చేసి “ప్రభూ! పాదుషా మీకు ఫర్మానా వ్రాసి పంపించెద మని నాకుఁ జెప్పెను. అందువిషయమై మీతోఁ గొన్నిసంగతులు మనవి చేసికొన వచ్చితి” నని చెప్ప, అజాఫ్‌ఖానుడు ఢిల్లీ పాదుషావునకుఁ బోయియున్నయువతి యీ మెయే యని యనుకొని, తనసంకల్పమునకుఁ దోడ్పడినయా మెను గౌరవించి “అమ్మా! నీ వెవరవు?” అని ప్రశ్నించెను.

బూబు—అయ్యా! ఈనాశరీర మీవఱకుఁ దమచే నెక్కువఁగఁ బ్రేమింపఁబడు చుండెడిదే. ఇప్పుడు నాపై మీకుఁ గొంతకోప ముండినను నుండవచ్చును.

ఖాను—నామనస్సంకల్పము నీవలన నెఱవేరుటకు సిద్ధముగ నున్నది. నీపై నాకు గోప మెందుకు? నీ వెవరవో వచింపుము.

బూబు—నే నొకానొకసమయంబున మిమ్ము మోసపుచ్చితిని. అందుచే నింత కాలము మిమ్ము జూడక తిరిగి మీదయను బడయఁ గోరి మీమనస్సంకల్ప మెఱింగి యుండుటచేఁ గల్లమాటలు చెప్పి చక్రవర్తిచే మీ కీఫర్మానా వ్రాయించితిని.

ఖాను—నీ వేమి మోసము చేసియున్నను నీవు వ్రాయించినయీఫర్మానా నాకు మహోపకారక మగుటచే నీయందు నా కెంతయో గౌరవము కలదు. కావున నీ వొనర్చినమేలు మఱచువాఁడను గాను. నీ వెవ్వతెవు? రహిమాన్‌ఖానుడు దుర్గావతి యని నా కంటఁగట్టిన మాయావతివా యేమి?

బూబు—అయ్యా! నన్ను క్షమింపుము. దుర్గావతి యని మాయావతిని మీకుఁ దార్చిన రహిమాన్‌ఖానుడను నేను.

అని యెఱింగింప, అజాఫుఖాను డాశ్చర్యము చెంది “రహిమాన్! దుల్పటుషా చేతిలోఁ జిక్కి చచ్చిపోయితి వని విచారించుచుంటిని. నీవు కావుననే యింతపన్నుగడ పన్ని చక్రవర్తిని మాయ చేసితివి. నీబుద్ధికిఁ జాల సంతోషించితిని. ఇంక మన కోర్కెలు పూర్తిగఁ గొనసాగును. ఈసారి దుల్పటుషాను జంపి, దుర్గావతిని నేను బొంది, ఘుర్కమండలాధిపత్యము నీకు శాశ్వతముగ నిప్పించెదను. చక్రవర్తి వెంటనే ఘుర్కమండలముపై దాడిపెట్టుట కానతిచ్చెను. నే నీదినమున ఢిల్లీకిఁ బోయి పౌఁజులను వెంటబెట్టుకొని వచ్చెదను. ఈలోన నీవును అబ్దుల్‌ఖానుడును మునుపటియట్లు సఖ్యముగ నుండి నాకు సహాయము చేయ సిద్ధముగ నుండుఁడు.” అని చెప్ప రహిమాన్‌ఖానుడు సంతసించి యచ్చటనుండి వీడ్కొనెను.

# ముప్పదియవ ప్రకరణము.

——(:)——

నూతనదాంపత్యసౌఖ్యమునకు మించిన యైహికసౌఖ్యము వేఱొదియు లేదు. భార్యాభర్తలయం దన్యోన్యగాఢానురాగము వెలసినచో, లేమియం దయినను వారల కాపురము స్వర్గతుల్యమే యనవచ్చును. అన్యోన్యగాఢానురాగము గలిగి రాజ్యవైభవో పేతు లయిన దుర్గావతి దుల్పట్‌సాల నూతనదాంపత్యసౌఖ్యమును దేనితోఁ బోల్ప వలెనో తెలియకున్నది.

ఆ ట్లారాజదంపతు లింతింతనరానియమితభోగసౌఖ్య మనుభవించుచు నొక్క నాఁడు ప్రాతఃకాలమున నర్మదానదీతీరంబునం గలయుద్యానవనంబున విహరించుచుండ నొక స్త్రీ యాచేరువనుండి గీతగోవిందము మనోహరంబుగఁ బాడుచుండెను. దుర్గావతి "యీకంఠస్వర మెచ్చటనో వినియుంటిని." అని యాలోచించుచు నాపాట పాడువా నిని దోడ్తె మ్మని యొకసేవకుని బంప, నాతఁ డామెను నామెకడకుఁ దీసికొనిపోయెను. దుర్గావతి యామెచేఁ గొంతవడి పాడించి కొంత బహుమానద్రవ్య మామెచేతిలో నిడఁ బోవ నాపాటకత్తె యాదానమును బరిగ్రహింపక "అమ్మా యింతతో నాకడుపు నిండు నది కాదు. నేను బిచ్చ మెత్తుటకు రాలేదు. మీనాయనగారిగ్రామవాసుల ననే కుల రావించి వారలకు స్థిరజీవనోపాయములు గలిగించితిరి. నిండుబండికిఁ జేటబరు వగునా? నేనును కనోజిగ్రామకాపురస్తురాలనే. వెనుక నొకప్పుడు మీ రుపకారము చేసెద మని చెప్పియుండుటచే నాసించి వచ్చితిని. నాకును జీవనోపాధి గలిగింపఁ బ్రార్థించు చున్నదాన" నని విన్నవించుకొనెను. "నే నెన్నఁడు వాగ్దానము చేసియుంటిని?" నని దుర్గావతి యడుగ నామె "అమ్మా! నే నొకనాఁడు ప్రాతఃకాలమున తంబుఱ మీటుచు గోవిందనామస్మరణము చేసికొనుచు కనోజివీధివెంబడి నడచుచుండఁ దా మఱ్ఱియొద్ద నచ్చట నిలువఁబడి నాతోఁ బ్రసంగించుచుఁ జెప్పితిరి. నాచేతి కొకయుత్తరము కూడ నిచ్చితిరి" అని చెప్ప, దుర్గావతి యాశ్చర్యముఁ "బొండి యానాటిదాసరివి నీవేనా? నీ వఱ్ఱియొద్ద దాసరివేషము నేల దాల్చితివి?" అని యడిగెను. ఆపాటకత్తె "అమ్మా నన్ను క్షమింపుడు. ఒకానొకప్పుడు మీయెడ మహాపరాధము చేసితిని. నా పేరు

మాయావతి యని చెప్ప సమస్తము మీ రెఱుంగఁగలరు. నేను మీతల్లిగారి కొనర్చిన మహోపకారదోషమునకుఁ బశ్చాత్తాపము నొంది పాపపరిహారార్థము భగవన్నామస్మరణముఁ జేసికొనుచు నలుగురిలోఁ దల యెత్తుకొనుటకు లజ్జించి దాసరివేషముతోఁ గొన్నాళ్ళు భిక్షాటనంబునఁ గాలక్షేపముఁ జేసితిని'' అని వచించెను. దుర్గావతి కనికరము గలది యగుటచే నామెను దనచేటికగా నుండునట్లు నియోగించి పోషించుచుండెను. మాయావతియు దుర్గావతియెడ నత్యంతభక్తి గలిగి సేవించుచు రాణియొక్క విశ్వాసమునకుఁ బాత్రురాలయి మెలంగుచుండెను. తఱువాతఁ గొంతకాలమునకు మాయావతి దుర్గావతిని వేఁడికొని తాను నూతనముగ భర్తగా నంగీకరించిన దామోదరునకుఁ గూడ మరల నుద్యోగము చేయించెను. మాయావతీదామోదరులు దుర్గావతీదుల్పటేపాలను గొల్చుచు దమయావజ్జీవము వారికై ధారవోసిరి.

## ముప్పదియొకటవ ప్రకరణము.

———(:)———

దుష్కర్మాచరణమునకు భగవంతుఁడు భంగము కలిగించును గావున అజాఫ్ఖానుడు ఘుర్ మండలముపై దాడివెట్టుటకు మహోత్సాహుఁడై సహాయార్థము కొంతపౌఁజును గ్రహింప ఢిల్లీకిఁ బోయియుండునంత హుమయూను షేర్ఖాను అనుశత్రువును బక్సారువద్ద గదియఁ లసినవాడయ్యెను. అందుచే అజాఫ్ఖానునియుద్దేశ మెంతమాత్రము సాగలేదు. అంత హుమయూనుచక్రవర్తికి రాజ్యభ్రష్టత్వము ప్రాప్తించెను. సూర్ వంశజుఁ డగు షేర్ఖానునకు ఢిల్లీయాధిపత్య మలవడెను. ఈనూతనపరిపాలనమున అజాఫ్ఖానునియుద్యోగ మూడవలసినదే కాని స్తోత్రపాత్రనైపుణ్య మాతని కుద్యోగము నిలువఁబెట్టెను. కాని వానితో ల్లిఁటియాట లడుగంటెను. అట్లు సూర్ వంశజులు ఢిల్లీరాజ్యమును ౧౫౪౦ సం॥ మొదలు ౧౫౫౫ సం॥వఱకు బరిపాలించిరి. ఆకాలమున హుమయూనుఁ డజ్ఞాతవాసము జరపెను. తరువాత నావంశజుఁ డగు సికందరుసా రాజ్యము సేయుచుండునపుడు ౧౫౫౫ సం॥లో పానిపట్టువద్ద హుమయూనుఁ డాతనిని జయించి ఢిల్లీసామ్రాజ్యమును మరల సంపాదించుకొనెను. కాని రాజ్యసౌఖ్యము నాలు మాసములపాటైనను బూర్తిగ ననుభవింపక ౧౫౫౬ సంవత్సరమునఁ బరలోకగతుఁ డయ్యె.

పిదప నాతనికుమారుఁడు అక్బరు పట్టాభిషిక్తుఁ డయ్యెను. అతఁ డప్పటికి నుమారు పదుమూఁడేండ్లప్రాయమువాఁ డగుటచేబహరామ్ఖానుఁ డను పేరు గలసర్దారతనికి సంరక్షకుఁడై సమస్తరాజ్యపాలనము నిరంకుశముగ నడపుచుండెను. అక్బరు వాని నెంతయో గౌరవించెడివాఁడు. బహరామ్ఖానుఁడు రాజకార్యములు చక్కఁబెట్టుచున్న కాలములో అజాఫ్ఖానుడు చెప్పుకిందితేలువలె నణగియుండెను. కాని యిటీవల అక్బరు పెద్దవాఁడైనకొలఁది అజాఫ్ఖానుడు వానిసమక్షమున కప్పుడప్పుడు పోవుచుఁ దనచతురతవలన నాతనిదయను సంపాదించెను. క్రమక్రమముగాఁ జక్రవర్తికి బహరామ్ఖానునిపై ద్వేషము జనింపఁజేసి యాతనినిరంకుశాధికారమునకు భంగము

కలిగించెను. అంత బహరాంషెఖానుడు చక్రవర్తిపైఁ గోపించి యాతనితో యుద్ధమునకు గడంగెను. అక్బరు వాని నోడించినందున నాతఁడు మక్కాకు యాత్రార్థమై పోవుచు దారిలో నొకశత్రువుచే జంపఁబడెను. అంత అజాప్‌ఖానుడు పాదుషాకు బ్రియమైన యాంతరంగికుఁడై ప్రబలె. అప్పటికి అజాప్‌ఖాను డేబదియేండ్లు గడచిన పెద్దవాఁడగుటచే జక్రవర్తి యాతనియం దెంతయో గౌరవము చూపుచుండెను.

## ముప్పది రెండవ ప్రకరణము.

దుర్గావతి దుల్పట్ షాతో సుమారు పదుమూఁడు సంవత్సరములు కాపురము చేసిన తరువాత క్రీ.శ. 1549 సం. లో గర్భవతి యై యొకపుత్త్రుని గనెను. తల్లిదండ్రు లాపుత్త్రునకు వీరనారాయణుఁ డని నామకరణము చేసిరి. లేకలేక పుట్టినపుత్త్రుఁ డగుటచే వార లాతని నతిగారాబమునఁ బెంచుచు విద్యాభ్యాసము చేయించుచుండిరి. దుర్గావతి యాతని కతిశ్రద్ధతో నస్త్రశస్త్రవిద్యలు స్వయముగాఁ గఱపుచుండెను.

సంసారము విపత్తరంగములచే నిండిన సాగరమువంటిది. కావున దుర్గావతి నందనునకుఁ బదిసంవత్సరముల ప్రాయము ప్రాపింపఁగా దుల్పట్ షా ప్రియమైనభార్యాపుత్త్రులను వీడి కాలవశంబునఁ బరలోకగతుం డయ్యెను. రాణీదుర్గావతియొక్క విచారమునకు మేర లేదు. అయినను ధైర్యశాలిని కావున నామె తనకుమారుని సింహాసనాధీశునిఁ జేసి మిగులదక్షతతో ధర్మము ననుసరించి యతనిస్థానమునఁ దానే రాజ్యపాలనము చేయఁ గడంగెను. అట్లామె రాజ్యము నిర్వహించి రాజ్యమునం దెల్లెడలఁ బ్రజలకు మహోపయోగముగఁ గూపతటాకములు త్రవ్వించియు, వైద్యశాలలుంపించియు, విద్యాలయములు స్థాపించియు, జనులను సంతోషపఱచుచుండెను. ఆమె పాలించుకాలమున ఘుర్మండలరాష్ట్రము పాఁడిపంటలతో మహదైశ్వర్యముతోఁ దులదూఁగుచుండెను. చోరభయ మెందును జూపట్టలేదు. శత్రుభయ మెంతమాత్ర మామె కలిగియుండలేదు. కాని అజాపునిదురుద్దేశ మెఱింగియున్న దగుటచే నెన్నఁడైన నాతనినుండి ముప్పు తప్ప దని యనుకొనుచుఁ దనసామర్థ్యమునందు విశ్వాసము గలదియై యనుమానము లేనిధైర్యముతో మెలంగుచుండెను. ఆమెనందనుఁడు నానాటికి శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్థమానుఁడై సింగపుఁగొదమవోలె నుండి తల్లియొక్క ధైర్యగుణమును వేయిరెట్లు వృద్ధిపఱచెను. అట్టిపుత్త్రునిఁ జూచికొని యామె భర్తృవియోగదుఃఖమును సైతము మఱచి సంతుష్టిని గాలము గడపుచుండెను.

# ముప్పదిమూఁడవప్రకరణము.

అక్బరు రాజ్యపాలనము తనచేతిలో నుంచుకొనినది మొదలుగఁ దనరాష్ట్రమును నలుదెసల విశాలముగ వ్యాపింపఁ జేసెను. పరిపాలనానుగమ మెఱింగినచక్రవర్తి యగుట వలనఁ దనవిశాలరాష్ట్రమును, పెక్కుసూభాలుగా విభజించి సూభా కొక్కొక్క సుబేదారుని నియమించెను. మధ్యహిందూస్థానమునకు అజాఫ్ ఖానుఁడు సుబేదారుగ నియోగింపఁబడెను.

చక్రవర్తి తనయెడఁ జూపుచున్న గౌరవమువలనను తనయధికారప్రాబల్యము చేతను, అజాఫ్ ఖానుఁడు పుట్టకు బుట్టినబుద్ధి పుడుకలతోఁ గాని పోవ దన్నట్లు వృద్ధుఁ డయ్యుఁ దనదుష్ప్రవర్తనమును మానినవాఁడు గాక పూర్వముకంటె దుష్టుఁడై యతిశయించెను. యౌవనము వానిశరీరమునుండి దిగజాఱినను నరిషడ్వర్గ మింకను నెలకొని యుండెను. కావున నప్పటికిని వానికి దుర్గావతియం దాశ వీడలేదు. దుల్పట్ షా చనిపోయినతఱువాత వానికి నయ్యాశాపాశము మఱింత పెనఁగొనెను. అందుచే నాతఁ డామెకు భర్తృవియోగ మబ్బినదినములలో వ్రాసియుండినపరామర్శలేఖయందు దనయభిప్రాయమును సూచించి యామెచేఁ దిరస్కృతుం డయ్యెను. అప్పటినుండియు నజాఫ్ ఖానుఁ డామెను బలిమిచే నైన సాధింప నెంచి చక్రవర్తి కామెయెడ ద్వేషము జనింపఁ జేసి యుద్ధము పొసఁగ జేయవలె నని ప్రయత్నించుచుండెను.

కాని, అక్బరు మహమ్మదీయప్రభువులలో నెల్ల సజ్జనుఁ డని విఖ్యాతి వడసిన వాఁడు. అతఁడు తనసమర్థతవలన సకలరాజులను దనసామ్రాజ్యమునకు లోఁబఱచికొని వారలరాజ్యము లాయారాజులయేలుబడిక్రిందనే యుంచి వారిని విశేషగౌరవముతో నాగరించుచుండెను. హిందూమహమ్మదీయుల నేకభావముతోఁ బాలించెను. హిందూ రాజులను జయించినప్పుడు వారల నేవిధమైనయమర్యాదకును బాలు సేయలేదు. వారి దేవాలయములను భంగపఱచలేదు. హిందూమతమును ద్వేషించినవాఁడు కాఁడు. కావున 'హిందువులవలెఁ గుండలములు ధరించి నుదుట బొట్టు, బట్టకట్టు గలవాఁడై యుండెను. అతఁడు సర్వసమమతస్థుఁడు. అందఱకు నొక్కఁడే సర్వేశ్వరుఁ డను

నమ్మకము గలిగినవాఁడు. భూతదయచే నతనియంతఃకరణము పరిశుద్ధ మైనది. అందుచే హిందువులంద ఱాతని మహనీయుఁ డని నుతించెడివారు. అట్టిసుగుణసంపన్నుఁడు కావుననే దుర్గావతిపై నజాఫ్ ఖానుడు మరలమరలఁ జెప్పుచుండినయాజ్ఞావచనములను గొంతకాలమువఱకుఁ జెవిని బెట్టుచుండెడివాఁడు.

## ముప్పదినాల్గవప్రకరణము.

చెప్పెడుమాటలు చెడ్డవి గదా? ఒకనాఁడు అజాఫ్ ఖానుఁడు చక్రవర్తి సముఖమున కేగి "ప్రభూ! రాణి దుర్గావతిపాలనముక్రింద నున్నఘుర్ మండలము తప్ప మధ్యహిందూస్థాన మంతయుఁ దమసామ్రాజ్యమునకు లోఁబడి యున్నది. అందుచే మన యెడలను రాణి దుర్గావతి చూపుచున్ననిర్లక్ష్యభావ మటుండ నిండు. ఆమెను జయించు నంతటిశౌర్యసాహసములు మనకు లేక యూరకొంటి మని లోకులు వచించుచున్నారు. ప్రాసాదాంతరముల వసించియున్నతమ కిట్టిలోకసమాచారములు తెలియనేరవు. వీరుఁడ నని పేరొంది తమయన్నము తినుచున్న నే నీయపకీర్తిని భరింపఁజాలకున్నాను. కావున ఘుర్ మండలము మనసామ్రాజ్యమునకు లోఁబడునట్లు చేయక తప్పదు. అందుకు నా కనుజ్ఞమాత్రము దయసేయుఁడు. ప్రభువారికి శ్రమము గలుగఁ జేయక నేనే యీకార్యము నిర్వహించెద" నని చెప్పెను. అందుపై రాజ్యకాంక్షయుఁ దోడై అక్బరుచక్రవర్తి వంటి మహనీయుని అజాఫునిదుర్బోధనమునకు లోఁజేసి తల యూపించెను.

క్రీ॥శ॥ ౧౫౬౩ సం॥ లో అజాఫ్ ఖానుడు చక్రవర్తి యనుమతి వడసి ఘుర్ మండలముపైఁ బ్రబలసైన్యముతో దాడి వెడలెను. దుర్గావతి దినదినము అజాఫునినుండి ముప్పును నిరీక్షించుచున్నదే కావున నయ్యెడ 500 కరులను 500 తురంగములను గొప్ప కాల్బలమును సిద్ధము చేసికొని, పురుషవేషము దాల్చి యాయుధపాణి యై గజేంద్రము

నొక్క మోమునుండి కాదరిస ముట్టిపడఁ బ్రత్యక్షదుర్గవలె సమరభూమిని సైరికి మోమిచ్చి నిల్చెను. యుద్ధము ప్రారంభ మయ్యె. రాజభక్తి గలయా మెసైనికులు సేనానాయకులుఁ దమరాణిగారిభీకరాకృతి నవలోకించి మహోత్సాహముతో నతిశౌర్య సాహసములతో శత్రుసైన్యముపైఁ బడి కఱకఱలు లైనతురకసిపాయిలఁ గఱకఱ నఱకుచు వనేకుల రూపు మాపిరి. యవనులు గడ్డముల నిమురుకొనుచు గోండుసైనికులపై బాణ వృష్టి గలిగించిరి. గోండుసైనికులు కన్నులనుండి నిప్పులు గ్రక్కుచుఁ దురకదండుపైఁ బిడుఁగులు గురిపించిరి. ఇట్లొకదిన మంతయు నుభయసైన్యములు హోరాహోరిని బోరొనరింప, యవనవాహినులు గోండుసైనికులప్రతాపతీవ్రాతపంబునఁ బూర్తిగ శుష్కించెను. ఇంక గోండ్లు అజాఫుని బరలోకమునకంపఁ గంకణము గట్టుకొనిరి, కాని యాతఁడు ప్రాణము దక్కించుకొని పాఱిపోయెను. ఈయుద్ధముయొక్క పర్యవసానము గోండుసైనికులకు మహోత్సాహము గలిగించెను. కాని అజాఫ్ ఖానునితో యుద్ధము మరలమరల నిరీక్షించుచున్న దుర్గావతికి సంతుష్టి యెంతమాత్రము గలుగలేదు. అజాఫ్ ఖానుడు స్త్రీలచే నోడింపఁబడుట కెంతయుఁ జింతించి తిరిగి కొలఁదికాలములో ద్రొల్లిఁటికంటె నెక్కుడుసైన్యమును ఫిరంగులాదిగాఁ గలయుద్ధసామగ్రిని గూర్చుకొని ఘుర్ మండలముపైకి దాడివెడలెను. ఈ రెండవఘోరయుద్ధమునందుఁ గూడ దుర్గావతికే జయము పొసఁగెను. అక్బరుచక్రవర్తిచే మహాశూరుఁ డని మిక్కిలి కొనియాడఁబడిన అజాఫ్ ఖానుడు ఘనలజ్జాన్వితుఁడై గొప్పటి కైన నెట్టులైన దుర్గావతిని జయించి తీరవలె నని కృతనిశ్చయుఁడై యుండెను. అబలను వంచించుట కిట్లు ప్రతిన చేసినవాఁడు నీచుఁడు గాక వీరుఁడా?

అజాఫ్ ఖానుడు కడపటిసారి ప్రభుసైన్యములు గూర్చుకొని తమయొద్ద నున్న ఫిరంగు లన్నియు నగ్రభాగమునం దుంచి ఘుర్ మండలసైన్యములపై నకస్మాత్తుగాఁ బడి తనసామర్థ్యము నంతయుఁ జూపఁ జీకాకుపడి వారు శత్రువుల మార్కొన శక్తులు కాక యుండిరి. ఇట్టిదురవస్థఁ జూచి దుర్గావతీనందనుఁ డల్పవయస్కుఁ డయ్యు నభిమన్యుకల్పుఁడు కావునఁ దాను ముందు నిల్చి “వెఱవవలదు. వెఱవవల” దని సైనికులకు ధైర్యము చెప్పుచుఁ దాను శత్రువుల నెదిరించి పోరెను. ఇట్లాబాల శూరుఁడు గొంతవడిఁ బోరాడి బాణఘాతముచే మూర్ఛిల్లి నేలఁ గూలెను. అప్పుడు సైనికులు చింతాక్రాంతులై యాదుఃఖవార్త నింకొకవైపునఁ దురకలను మర్దించుచున్న

దుర్గావతి కళవళించెను. బిడ్డకుఁ దగిలిన యీగాయము కనిన దయ్యెను దుఃఖించుట కిది సమయము గాదని యెంచి యనుమాత్రముఁ జలింపక పుత్రవాత్సల్యము వీడి సేనాధిపతిం జూచి "ఈసమయమున ధైర్యము వదలి దుఃఖించుటకుఁ దగియుండలేదు. శత్రుధ్వంసనము మనకు ముఖ్యకర్తవ్యము. ఈశ్వరేచ్ఛవలన నైనకార్యమునకు వగవఁ బని లేదు. కావునఁ బిల్లవానిని శిబిరమునకుఁ గొనిపోయి సముచితోపచారములు సేయుఁడు. ఆయువుండిన బ్రతుకును. నే నిప్పుడు యుద్ధము విడిచి వచ్చుటకు వీలు లేదు. రణయజ్ఞము సమాప్తి చేసి ప్రాప్తి యున్నఁ గుఱ్ఱనిఁ జూచెదను" అని దుర్గావతి పల్కెను. సేనానియు నామెయాజ్ఞను శిరసావహించి యాడింభకుని శిబిరమునకుఁ బంపివేసెను. తఱువాతఁ గొంతసేపటి కాతఁడు ప్రాణము వీడెను.

యుద్ధమునఁ గొంతసేపు వారికి జయము, కొంతసేపు వీరికి జయము పొసఁగుచు నెవ్వరు గెల్చెదరో నిశ్చయింప నవకాశము లేక యుండెను. ఇట్లు యుద్ధము హోరాహోరిని జరుగుచుండ, నయ్యది హిందువులస్వాతంత్ర్యనాశనకాలము గావునఁ దురుష్కులకే యాధిక్య మలవడెను. గోండుసైనికులు పోరాడి పోరాడి నిరుత్సాహులైరి. గోండు లుత్సాహమును వీడినకొలఁది మ్లేచ్ఛుల మెచ్చుచుండెను. తురక లుత్సాహముతో దీన్! దీన్!! అనుజయఘోషము లుచ్చరించుచు గోండులఁ దెగటార్చిరి. ఇట్లు భయంకరసైనహననయజ్ఞము జరుగుచుండ దుర్గావతి మాత్రము స్వల్పసైన్యముతో సాహసంబునఁ బోరాడుచుండెను. ఆమెను మార్కొనుటకు అజాఫ్ ఖానుఁడు సవిూపించెను గాని రౌద్రరస ముట్టిపడుచున్న యామెముఖమునుఁ గాంచి వెఱఁగంది వెనుకకుఁ బోయి యామెపై బాణవృష్టి గురిపించెను. ఆమెయుఁ దనపైఁ గురియుచున్నశరపరంపరలఁ ద్రుంచెను గాని యం దొకక్రూరశర మామెయెడమనేత్రముపై గ్రుచ్చుకొనఁగా, మఱింత క్రోధావిష్టమానస యై యాబాణమును దానే పెకలించుకొని, వ్రేటుపడ్డయురగాంగనవలెఁ దొల్లిటికంటె నత్యుగ్రావేశంబునఁ బోరాడ సాగెను. అప్పు డామె శరీరమంతయు రక్తసిక్తమై యుండుట చూచి విశ్వాసము గలసేవకుఁ డాధారుఁడు "అమ్మా! మీ రిఁక యుద్ధము చేయఁ జాలరు. చేసినను లాభము లేదు. శత్రువులు మిమ్ముఁ జెఱపట్టఁ గలరు. వారిచేతులలోఁ బడక శీఘ్రముగా నిచ్చటనుండి పలాయనమగుట మేలు. తమ కీయాపదయందు హానీయక నే నావలకుఁ గొనిపోవుదును. రండు!" అని పల్కెను. తనపవిత్రగాత్రము మ్లేచ్ఛునిచేతిలోఁ జిక్కుట కిచ్చగింపని యాధీరవనిత

"ఓసీ! క్షత్రియకన్య నగుటచే పగఱకు వెన్నిచ్చి పారుట నా కనుచితము గావున నీకు నాయందు భక్తి గలదేని నీకృపాణముతో నాశిరస్సును ఖండింపుము. స్వామిని యాజ్ఞ ననువర్తించిన నీ కేకలుషమును నంటఁ జాలదు." అని పల్కెను. దామోదరుఁడు తన్నుఁ జిరకాలమునుండి పుత్త్రవాత్సల్యముతో సంరక్షించుచున్న మాతను జేతులారఁ జంపుటకు మనం బొడఁబడనివాఁడై "అమ్మా? నామనవి వినుఁడు. మిమ్ముఁ జంప నాకే లా[illegible]ను. మనంబును నిచ్చగింపదు. వీరారు వైరికరంబునఁ జిక్కుటకు సహింపను. కావున శీఘ్రముగాఁ బలాయన మగుట శ్రేయస్కరము" అని చెప్పెను. అప్పుడు దుర్గావతి సేవకునిముఖచర్య గాంచి తాను నియమించినపని నెరవేర్చుట కతఁడు సమర్థుడు కాఁడని తలపోసి సేవకుని కిట్లు చెప్పెను. "దామోదరా! నీవు నన్ను ఖండింపఁ జాలినవాఁడవు కావు. సమయము మించుచున్నది. అదిగో శత్రువులు పైఁబడుచున్నారు. నాశరీరము వారికిఁ జిక్కనీయకుము. ఇదిగో నేనే యాత్మహత్య గావించుకొంటిని. ఎదుటిదే నే వసింపఁబోవువీరస్వర్గము."

మహత్తరకార్యములు చేసి, యశోధన లైనస్త్రీలేని, పురుషులేని, విగతజీవు లైనను బ్రపంచమున నాచంద్రతారార్కముగ సజీవు లైనయట్టులనే విలసిల్లెదరు. వారి నామములనే యెల్లరు స్మరింతురు. వారిచరిత్రములనే యెల్లరు పారాయణ చేయుదురు. వారిసంకీర్తనములే సర్వదా పాడుచుందురు. కావున మనదుర్గావతి నేటికిని, యింకను జీవించియున్నది. జీవింపఁ బోవును.

దామోదరుడు స్వామినియాజ్ఞ శిరసావహించి తానును నామెను గొలువఁ బోయెను. ఆహా! ప్రభువిశ్వాస మన్న నట్టిదే కదా!

సమాప్తము.

# P. SUBBAROY

## *Ayurvedic Pharmacy*

## Sri Venkatesa Perumalkoil Sannithy

## *TANJORE*

7. నేత్రబిందు;—కండ్లనొప్పి, కండ్లపోటు, కండ్లలోనుండి నీరుకారుట, రేచీకటి, పుసిళ్ళుకట్టుట, మాంసము పెరుగుట, పువ్వుపడి యుండుట, కండ్లమంటలు, కండ్లెరుపు, కండ్లదురద, కండ్లుపొగమారి నట్లుండుట, కనుబొమలనొప్పులు, వీటినిగుణపరచును చదువువారికిని యెప్పుడును చూపు దూరపార్శ్వములో నుండువారలకును అతిశ్రేష్ఠమైన ఔషధం. ఈమందు వుపయోగము చేయువారలు ముక్కద్దము వేసుకోవలసినది అనావశ్యకము. సీసా 1 కి వెల అ. 8. 1 మొదలు 6 సీసాలవరకు పంపుటకు వి. పి. శెలవు అ 5 ప్రత్యేకం.

8. కర్ణబిందు;—చెవులలో చీముకారుట, నొప్పి, పోటుపు, చెవులు మూసుకొనిపోవుట, కూతలు చెవ్వుడు, వీటిని గుణపరచును. చెవులుబాగా వినును. సీసా 1 కి. వెల అ. 8. 1 మొదలు 6 సీసాలవరకు వి. పి. శెలవు అ. 5. ప్రత్యేకము.

9. సర్వవాతసంహారి;—నడుము, తొడయొక్కసందులు మొదలగు యేస్థలములలోనైనను మేహవాత, రొంగిలిచిడుమును మూగతీట. మూగగజ్జి, శిబ్బి మొదలగు వ్యాధులను గురితోటి యతిశీఘ్రములో గుణపరచును. సీసా 1 కి వెల అ. 4. 1 మొదలు 6 సీసాలవరకు వి. పి. శెలవు అ. 5. ప్రత్యేకము

10. విరేచనమునకు మాత్రలు;—కడుపునొప్పిగాని, వికారముకాని, ఆయాసముగాని లేక సుఖముగా విరేచనమగును. అజీర్ణం పిత్తవుపద్రవములు, సకలమైన వాయువులు, మలబద్ధము, అగ్నిమాంద్యము, వాతం, నడుము, చేతులు, కాళ్ళు, మొదలగు అవయవములు నొప్పులు, సకలమయిన జ్వరములు మొదలయిన వ్యాధులను స్వాస్థపరచును. సీసా 1 కి అ. 8. 1 టి మొదలు 6 సీసాలవరకు వి. పి. శెలవు అ, 5. ప్రత్యేకము

11. జ్వరసంహారి;—బహుకాలముగా తీరనిజ్వరములు, చలిజ్వరం, పంతుజ్వరం వాతజ్వరం, పిత్తజ్వరం, కపజ్వరం, అస్థిజ్వరం, రొమ్మునొప్పి, నడుమునొప్పి, పక్కనొప్పులు, మోకాళ్లనొప్పులు, వొళ్ళుతెలుపుపారి యుండుట, మైకము, దాహము రెండుదినములకు నాలుగుదినములకు వచ్చేడు పంతుజ్వరం మొదలగు సకలజ్వరములనుబొత్తిగా మాన్పును. డబ్బి 1 కి వెల రు. 1. వి. పి. శెలవు అ 5. ప్రత్యేకము.

12. రోమసంహారి;—ఈ చూర్ణమును వెండ్రుకలు మొలచియుండేను తావులో చరమినయెడల అతిశీఘ్రములో వెంట్రుకలు తొలగిపోవును. మంటలు మొదలగు బాధలులేవు. సీసా 1 కి వెల అ. 4. 1 మొదలు 6. సీసాలవరకు వి. పి. శెలవ్వు, అ. 5. ప్రత్యేకము.

13. సుగంధపండ్లపొడి;—మంచిజీర్ణశక్తియిచ్చును. పండ్లనొప్పి యేకాలమందును రాదు. పండ్లుయెప్పుడును పసవు. సీసా 1 కి అ. 3. 1 టి మొదలు 5 సీసాలవరకు వి. పి. శెలవు అ. 5 ప్రత్యేకము.

14. మేలైనకస్తూరి;—అతిఅద్భుతమైనది. కాష్మీర్ దేశమునుండి రప్పించబడినది- మావద్దసదా దొరకును. తులం 1 కి రు. 48. చిల్లరగా 1 ద్రా తక్కువకు ఇవ్వబడదు. వి. పి. శెలవులు ప్రత్యేకము.

15. తేలుకుట్టుకుమందు;—ఈమందును కుట్టినచోట చరిమితే తక్షణమే విషము దిగి సహించలేని బాధను తొలగించును అందరును ఆశ్చర్యపడి ఆనందము బొందుదురు సీసా 1 కి అ. 4. వి. పి. శెలవు 1టి మొదలు 12 సీసాలవరకు అ. 5 ప్రత్యేకము-

ఒకటేసారి 12 సీసాలకు తక్కువలేకుండ తేలుమందు కొనువారికి డజను రు. 2-8-0 చొప్పున యివ్వబడును. తేలుమందు మాత్రమేతప్ప యితరమందులు యీలాటి యేర్పాటు ఇవ్వబడదు.

16. మేహరణమందు;—దీనిని తెల్లగుడ్డలో చరిమి రణములమీదవేస్తె రొటువంటిరణములను ఆర్పును. దీనివెల సీసా 1 కి అ. 8. 1 టి మొదలు 6 సీసాలవరకు వి. పి. శెలవు అ 5 ప్రత్యేకము

17. కంఠశుద్ధిమాత్రలు;—ఈమాత్రలను మాయొక్క డైరక్షను ప్రకారం ఉపయోగించిన యెడల గొంతుకట్టు గొంతుకమ్ముకొని యుండునది పోగొట్టును. బహుఅందముగ పాడుటకు తగుమైన ధ్వనినిచ్చును. సంగీతవిద్వాంసులకును, ప్రసంగముచేయువారలకును బడిఉపాధ్యాయులకును యిదిఒక అద్భుతమయిన ఔషధముయెంతపాడినను ప్రసంగముచేసినను ధ్వనిమార్పుకయుండును. సీసా 1 కి అ. 8. 1 టి మొదలు 6 సీసాలవరకు వి. పి. శెలవు అ. 5 ప్రత్యేకము.

పి. సుబ్బరాయి, ఆయుర్వేదఔషధశాల,
శ్రీవెంకటేశ పెరుమాళ్లసన్నిధి, తంజావూరు.